# అలంకారశాస్త్రము - ఆధునిక సాహిత్యము


మహామహోపాధ్యాయ

ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు





ప్రకాశకులు

...తభాషా ప్రచారసమితి

హైదరాబాదు

# అలంకారశాస్త్రము - ఆధునిక సాహిత్యము

ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు




ప్రకాశకులు

సంస్కృతభాషా ప్రచారసమితి

హైదరాబాదు

ప్రథమ ముద్రణము - జనవరి, 1999

ప్రతులు - 1,000

వెల రు 12/-లు

ప్రాప్తిస్థానము:

సంస్కృతభాషా ప్రచార సమితి

(జి పుల్లారెడ్డి ఛారిటిస్ ట్రస్ట్ అనుబంధ సంస్థ)

5-4-743/C ,2వ అంతస్థు,

హరేకృష్ణ దేవాలయం ప్రక్కన,

నాంపల్లి స్టేషను రోడ్డు,

హైదరాబాదు - 500 001

ఫోను నం. 4615481,4609925,3323334



వసంతా గ్రాఫిక్స్,

203,సురభి ప్లాజా,

లకడీకాపుల్, హైదరాబాద్ - 4

ఫోను నం 3304627

ముద్రణ:

శ్రీ కళాంజలి గ్రాఫిక్స్,

విరల్‌వాడి, హైదరాబాదు - 29

ఫోను నం 3229831.

శ్రీః

# తొలిపలుకు

అలంకారశాస్త్రం అనే పేరుతో ప్రసిద్ధమైన భారతీయ సాహిత్యవిమర్శశాస్త్రం అతిపురాతనమైనది. ఇది ఎంత పురాతనమైనదో అంత నిత్యాధునీకమైనది. అయితే ఈనాడు వివిధ ప్రక్రియలలో సహస్రముఖాల విజృంభిస్తూన్న ఆధునికసాహిత్యానికి ఈ శాస్త్రం ఉపయుక్తం కాదని కొందరి అభిప్రాయం. ఇది అవిచారితరమణీయమైన అభిప్రాయం ఒక భాషను ఇటుత్రిప్పి, అటుత్రిప్పి ఎన్ని విధాల ఉపయోగించినా ఏ ప్రక్రియా కూడ ఆ భాషకు సంబంధించిన వర్ణమాలను ఆవంతకూడ అతిక్రమించజాలదు అయితే పక్షుల కిలకిలారావాలు, వ్యాఘ్రాదుల భాంకారాదులు ఈ వర్ణమాలను అతిక్రమించవచ్చును. కాని అవి భాషాపరిధిలోనికే రావు. అదే విధంగా ఏ రచన అయినా అది ఏ భాషలో ఉన్నా, అది ఏదైనా అర్థాన్ని వ్యక్తం చేయడం కోసం, భావాన్ని ఆవిష్కరించడం కోసం వ్రాయబడినదే అయితే అది అలంకారశాస్త్ర పరిధిని జవదాటజాలదు. అర్థంకాని, భావాలు లేని రచనలు ఏవైనా ఉంటే మాత్రం అవి కిలకిలారావ భాంకారాదుల వంటివే. వాటికి మాత్రం అలంకారశాస్త్రం ఎందుకూ ఉపయోగించదనే విషయం సత్యమే ఈ విషయాన్ని ప్రతిపాదించడం కోసమే ఈ లఘుకృతి ఉద్దిష్టమైనది.

దాదాపు నాలుగు సంవత్సరాల క్రితం ప్రొఫెసర్ పేర్వారం జగన్నాథం గారు తెలుగు విశ్వవిద్యాలయానికి కులపతులుగా ఉన్నప్పుడు వారి ప్రేరణచేత నేను ఆ విశ్వవిద్యాలయంలో "అలంకారశాస్త్రం – ఆధునిక సాహిత్యం" అనే విషయాన్ని గూర్చి ఉపన్యసించడం జరిగింది ఒకటిన్నర రెండునెలలు శ్రమపడి సేకరించిన విషయం పత్రపుటనిద్రాణం కాకుండా ముద్రితమైతే ఆ శ్రమ సార్థకం అవుతుందనే అభిప్రాయంతో ఇది ఒక చిన్న పుస్తకం రూపంలో ప్రచురించబడుతున్నది ఇది ఈ

ఆకారంలో ప్రచురించడానికి తగిన అవకాశం ఇచ్చిన సంస్కృతభాషా ప్రచార సమితికి తదధ్యక్షులైన శ్రీ. జి పుల్లారెడ్డిగారికి నా కృతజ్ఞతలు తెలుపుచున్నాను

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, సహృదయధురీణులు, పద్మభూషణులు అయిన శ్రీ సి నారాయణరెడ్డిగారు ఆధునికాంధ్రమహాకవులలో అగ్రశ్రేణికి చెందినవారు నేను సమర్పించు ఈ సౌహార్దోపాయనాన్ని అంగీకరించినందుకు వారికి కృతజ్ఞతలు ఆవిష్కరించు చున్నాను.

అలంకారశాస్త్రజ్ఞు లందరూ ఈ లఘుగ్రంథంలో చూపిన విధంగా ఆధునిక రచనలను పరిశీలించి అవి అలంకారిక ప్రస్థానాలలో ఏవో కొన్నిప్రస్థానాలకి లేదా ఏదో ఒక ప్రస్థానానికి చెందినవే అనే విషయం నిరూపించగలరని ఆశిస్తున్నాను

**పుల్లెల శ్రీరామచంద్రుడు**

కులపతి,

సంస్కృతభాషా ప్రచార సమితి

హైదరాబాదు,

తేది 9.1 1999

శ్రీః

# కృతి సమర్పణము

ఆధునికాంధ్రమహాకవులలో అగ్రశ్రేణికి చెందినవారు

గృహీత జ్ఞానపీఠ పురస్కారులు

పద్మభూషణులు, సాహితీబంధువులు

అయిన

## డా. సి. నారాయణరెడ్డిగారికి

సాహార్దంతో సమర్పించు

అక్షరోపాయనం

పుల్లెల శ్రీరామచంద్రుడు

# విషయసూచిక

## 1. మొదటిభాగం



## 2. రెండవ భాగం

# అలంకారశాస్త్రమూ - ఆధునిక సాహిత్యము

- ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు

## 1

**అలంకారశాస్త్రం :** "సౌన్దర్యమలఙ్కారః" - 'అలంకారం' అనగా సౌందర్యం అని అర్థం ఇది అలంకారశబ్దానికి వామనుడు కావ్యాలంకారసూత్రంలో (1 2) ఇచ్చిన నిర్వచనం "సౌందర్యం ఉంటేనే కావ్యాన్ని ఆదరిస్తారు " అని అంటాడు వామనుడు- "కావ్యం గ్రాహ్యమలఙ్కారాత్" (కా సూ 1.1) అయితే కావ్యానికి ఈ సౌందర్యం ఎలా వస్తుంది అనేది ప్రశ్న ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకం మొదలైనవాటిని, ఆ యా గుణాలు ఉన్న వైదర్భ్యాదిరీతుల్నీ పొందుపరుస్తూ, దోషాలు లేకుండా చూచుకుంటే కావ్యంలో సౌందర్యం వస్తుంది అందుచేత "కావ్యానికి సౌందర్యం చేకూర్చేవి కాబట్టి ఉపమాదులకి కూడా 'అలంకారం' అనే పేరు ప్రసిద్ధిలోనికి వచ్చింది" అని కూడా వామనుడు ప్రతిపాదించాడు- "కరణవ్యుత్పత్త్యా పునరలఙ్కారశబ్దోఽయమ్ ఉపమాదిషు వర్తతే" (కా సూ 1 2). కావ్యంలో ఉన్న సౌందర్యాన్ని గూర్చి, ఆ సౌందర్యానికి హేతువులైన ఉపమాద్యలంకారాలను గూర్చి, రీతిధ్వన్యాదులనుగూర్చి చర్చించే శాస్త్రం కాబట్టి అలంకారశాస్త్రానికి ఆ పేరు వచ్చిందని చెప్పవచ్చు

ఈ విధంగా కావ్యంలో సౌందర్యం చాలా ప్రధానమైనదని వామనుడూ తదితరులూ కూడా అంగీకరించడంచేత ఈ శాస్త్రానికి "సౌందర్యశాస్త్రం" అనే పేరు ప్రచారంలోకి వచ్చే పక్షంలో అది పాశ్చాత్యుల 'aesthetics' అనే దానికి దగ్గరగా ఉండి ఉండేదనీ, కాని ఎందుచేతనో సంకుచితార్థమైన 'అలంకారశాస్త్రం' అనే పేరు ప్రచారంలో ఉండిపోయిందనీ కొందరు అంటూ ఉంటారు ఇక్కడ ఒక్క విషయం గమనించవలసి ఉంది కావ్యవ్యాఖ్యానాదులలో ఆ యా శ్లోకాలలో ఉండే అలంకారాలను లక్ష్యలక్షణ నిర్దేశపూర్వకంగా విశదీకరించడం అలవాటుగా వచ్చింది అలాంటి వ్యాఖ్యానాలన్నీ చదివిన పరితలకు 'అలంకారం' అనగానే ఉపమాదులే మనస్సుకు స్ఫురిస్తాయి అందుచేత ఈనాడు మనం 'అలంకారశాస్త్రం' అనగానే 'ఉపమాద్యలంకారాలను గూర్చి చెప్పే శాస్త్రం' అని అర్థం చేసుకొంటున్నాం మనమే

కాదు, ప్రతాపరుద్రీయవ్యాఖ్యాత అయిన కుమారస్వామికూడా ఇలాగే గ్రహించి ఈ శాస్త్రంలో రసం మొదలైన విషయాలు కూడా ఎన్నో ఉన్నా ఛత్రిన్యాయంచేత 'అలంకారశాస్త్రం' అని పేరు వచ్చింది"("యద్యపి రసాలంకారాద్యనేకవిషయమిదం శాస్త్రం తథాపి ఛత్రిన్యాయేన అలంకార శాస్త్రముచ్యతే") అని వ్రాశాడు (నడిచి వెడుతూన్న పదిమంది గుంపులో ఇద్దరు ముగ్గురి చేతులలో మాత్రమే గొడుగులున్నా "గొడుగులవాళ్ళు వెడుతున్నారు" అని అంటాం. ఇదే ఛత్రిన్యాయం) అయితే 'అలంకారం' అంటే 'సౌందర్యం' అన్న అర్థం తెలిసిన తరవాత 'అలంకారశాస్త్రం' అన్నా 'సౌందర్యశాస్త్రం' అన్నా పర్యాయపదాలే అని అంగీకరించడంలో అభ్యంతరం ఉండడానికి వీలులేదు కదా! వామనుడే కాదు, ఆతనికి పూర్వం ఉన్న భామహాదులు కూడా 'అలంకార' పదాన్ని 'సౌందర్యం' అనే విస్తృతార్థంలో కూడా అంగీకరించి ఉంటారు. అందుచేతనే భామహుడు తన గ్రంథానికి "కావ్యాలఙ్కారః" అని పేరు పెట్టాడు అనగా "కావ్యసౌందర్యము" "కావ్యసౌందర్య ప్రతిపాదకగ్రంథము" అని అర్థం. తరవాత వచ్చిన వామన-రుద్రట-వాగ్భటాదులు కూడా ఈ పేరే తమ గ్రంథాలకి కూడా పెట్టారు వీరిలో అలంకారాలు మాత్రమే చర్చించినవారు ఒక్కరూ లేరు. అందుచేత కావ్యసౌందర్యాధాయకవిషయాలు ప్రతిపాదించే గ్రంథం కాబట్టి 'కావ్యాలంకారం' అని వీరి అందరి అభిప్రాయము అయి ఉంటుంది ఆ యా విషయాల ప్రాధాన్యాప్రాధాన్యాలను గూర్చి అభిప్రాయభేదం ఉండవచ్చు ఆ సౌందర్యాధాయకాలు ప్రధానంగా అలంకారాలు అని దండిభామహాదులు అభిప్రాయపడితే 'రీతి ప్రధానంగా సౌందర్యాధాయకం' అని వామనుడు అన్నాడు మరొకరు మరొకటి అన్నారు, అంతే. అందుచేతనే కావ్యాలంకారసూత్రానికి 'కామధేనువు' అనే వ్యాఖ్య వ్రాసిన గోపేంద్ర త్రిపురహరభూపాలుడు[1] - "కావ్యం గ్రాహ్యమలఙ్కారాత్" అని వ్రాసి అలంకారం అంటే ఏమిటి అనే ప్రశ్నకు సమాధానంగా "సౌన్దర్యమలఙ్కారః" అని మరొక సూత్రం వ్రాయడంకంటె "కావ్యం గ్రాహ్యం సౌన్దర్యాత్" అని మొదట్లోనే చెపితే సరిపోతుంది కదా అని ఆశంకించుకొని "గ్రంథానికి కూడా 'అలంకారం' అనే పేరు ఉన్నది 'అలంకార' శబ్దానికి సౌందర్యం అనే అర్థం చెపితేనే గ్రంథపరంగా ఈ పదాన్ని ప్రయోగించడం సాధ్యపడుతుంది అనే

1 ఈతని మరొకపేరుగోపేంద్ర తిప్పభూపాలుడు ఆంధ్రుడు, రెండవ దేవరాయల (క్రీ.శ 1423–46) కాలంలో రాజ్యపాలుడుగా ఉండేవాడు ఇతని వ్యాఖ్య చాలా ప్రామాణికమైనది స్వతంత్రవిచారభరితమైనది

విషయాన్ని సూచించడం కోసం ఈ విధంగా రెండు సూత్రాలు వ్రాయడం జరిగింది" అని సమాధానం చెప్పాడు- "యద్యపి 'కావ్యం గ్రాహ్యం సౌన్దర్యాత్' 'తద్దోషగుణాలఙ్కారహానోపాదానాభ్యామ్' ఇతి విన్యాసాన్తరే లాఘవం భవతి తథాపియోఽయ మలఙ్కారః కావ్యగ్రహణహేతుత్వే నోపన్యస్యతే తద్వ్యుత్పాదకత్వా చ్ఛాస్త్రమపి అలఙ్కారనామ్నా వ్యపదిశ్యత ఇతి శాస్త్రస్యాలంకారత్వేన ప్రసిద్ధిః ప్రతిష్ఠితా స్యా దితి సూచయితుం విన్యాసః కృతః- 'కావ్యం గ్రాహ్యమలఙ్కారాత్' ఇతి" (కామధేను.1 1.2 ). ఈ విధంగా 'అలంకారశాస్త్రం' అంటే 'సౌందర్యశాస్త్రం' అని చాలామంది ప్రాచీనులకు కూడా అంగీకార్యమే కావ్యసామాన్యానికి పర్యాయపదంగా వాడిన 'సుభాషితం' అనే పదాన్ని 'నీతిప్రతిపాదకవాక్యం' అనే సంకుచితార్థంలో, కాలాంతరంలో ప్రయోగించినట్లు ఈ అలంకారపదాన్ని కూడా సంకుచితార్థంలో ఈనాడు ప్రయోగించడం జరుగుతూన్నది

**క్రియాకల్పం, క్రియావిధి :** అతిప్రాచీనకాలంలో ఈ శాస్త్రానికి క్రియాకల్పం అనే పేరు ఉండేదని రామాయణలలితవిస్తరాదులద్వారా తెలుస్తూన్నది అలంకారశాస్త్రం లక్షణశాస్త్రం ఆ యా కావ్యాలు దానికి లక్ష్యాలు లక్ష్యం ముందా, లక్షణం ముందా అనేది ప్రశ్న. నిస్సంశయంగా లక్ష్యమే ముందు ఆవిర్భవిస్తుంది, తరవాత లక్షణం బయలు దేరుతుంది ముందుగా భాష అనేది ఒకటి ఉంటే తరవాత వ్యాకరణం వచ్చినట్లు. అయితే కొంతకాలానికి లక్షణశాస్త్రం లక్ష్యగ్రంథాలమీద అధికారం చలాయించడానికి ప్రయత్నం చేస్తుంది ఇది సార్వకాలికసత్యం భాషమాటలాడే ప్రతివ్యక్తిలోనూ అతనికి తెలియకుండానే కొంత వ్యాకరణజ్ఞానం ఉంటుం దంటారు భాషాశాస్త్రవేత్తలు. అదే విధంగా కలం పట్టిన ప్రతీవానికీ మనస్సులో కొన్ని నియమాలు మెదులుతూ ఉంటాయి. అందుచేతనే ఒకానొక కాలంలో జనించిన ఒక కవి ఒక విధమైన రచనలు చేసి మెప్పు పొందడం చూచి ఆ విధంగా తామూ వ్రాయాలని ప్రయత్నిస్తారు తరువాతివాళ్ళు. అంటే ఆతడు వ్రాసిన దానిలో ఉన్న పద్ధతులన్నీ ఆకళించుకొంటేనే ఆ విధంగా వ్రాయకలుగుతారు అనగా తమ మనస్సులో లక్షణశాస్త్రం ఒకటి నిర్మించుకున్నా రన్నమాట అది కొంత కాలానికి గ్రంథరూపం దాల్చినా దాల్చవచ్చు, దాల్చకపోనూవచ్చు.

వ్యాకరణం భాషను నియమించడం కోసం ప్రయత్నించినట్లుగా ఆ యా

కాలాలలో ఆవిర్భవించిన కావ్యనాటకాదుల్ని దృష్టిలో ఉంచుకొని, వాటిని విశ్లేషించి వ్రాసిన లక్షణశాస్త్రం కావ్యం ఎలా వ్రాయాలి, లేదా ఎలా వ్రాస్తే బాగుంటుంది అనే నియమాల్ని సూచిస్తుంది ఈ విధంగా నియమించగలిగిన శక్తి ఈ శాస్త్రానికి ఉండాలంటే అంతకుముందు అతివిస్తృతమైన సాహిత్యం ఉన్నదన్న మాట అందుచేత "కావ్యక్రియ ఇలా ఉండాలి", అనగా "కావ్యం ఇలా వ్రాయాలి' అని చెప్పేది కాబట్టి దీనికి 'క్రియాకల్పం' అనే పేరు ఆనాడు పెట్టుకొన్నారు దండికాలంనాటికి కూడా (క్రీ శ 7వ శతాబ్దం) ఈ పేరు ప్రసిద్ధిలో ఉండేది అందుచేతనే కావ్యాదర్శంలో దండి 'కల్ప' శబ్దపర్యాయమైన 'విధి' శబ్దాన్ని ఉపయోగించి ఈ శాస్త్రాన్ని 'క్రియావిధి' అన్నాడు- "వాచాం విచిత్రమార్గాణాం నిబబన్ధుః క్రియావిధిమ్" (కావ్యాద 1 9)

**సాహిత్యశాస్త్రం :** అలంకారశాస్త్రానికి సుప్రసిద్ధమైన మరొక పేరు సాహిత్యశాస్త్రం హిందీ మొదలైన ఉత్తరదేశభాషలలో దీని ప్రయోగం అధికంగా కనబడుతుంది 'సాహిత్యం' అంటే కావ్యనాటకాదివాఙ్మయం దానికి సంబంధించిన శాస్త్రం కాబట్టి ఇది 'సాహిత్యశాస్త్రం' అయింది సాహిత్యశబ్దానికి కొందరు గతానుగతికంగా "హితంతో కూడినది సహితం, దాని ధర్మం సాహిత్యం" అని ఒక నిర్వచనం చెపుతూ ఉంటారు దీని అర్థం అది కాదు అతిప్రాచీనుడైన (6వశతాబ్దం) భామహుడు కావ్యానికి "శబ్దార్థౌ సహితౌ కావ్యమ్" అని లక్షణం చెప్పాడు "కలిసి ఉన్న, అనగా హెచ్చుతగ్గులు లేకుండా ఒకదానితో ఒకటి అతికించినట్లు ఉన్న, శబ్దార్థాలు కావ్యం" అని దీని అర్థం కావ్యంలో మాత్రమే శబ్దార్థాలు కలిసి ఉంటాయన్న మాటేమిటి, అన్నివిధాలైన వాక్యాలలోనూ, అనగా శాస్త్రగ్రంథాదులలోనూ, లౌకికాలైన లేఖాదుల్లోనూ కూడా ఇవి కలిసి ఉంటాయి కదా? అంటే కావ్యంలో ఉండే శబ్దార్థసాహిత్యానికీ, తదితరమైన దానికీ తేడా ఉందని ఈ లక్షణం చెప్పినవారి అభిప్రాయం ఎక్కడ ఏ పదం ఎలా వాడాలో, ఏ అర్థం చెపితే ఉచితంగా ఉంటుందో బాగా ఏర్చి, కూర్చి వాడాలి కావ్యంలో ఇతరమైన వాటిలో ఒక పదం ఇట్లైనా, అట్లైనా, ఒక పదానికి బదులు మరొకపదం వాడినా తప్పులేదు అలాంటి శబ్దార్థసాహిత్యం కావ్యనాటకాదులలో ఉంటుంది కాబట్టి, ఉండాలి కాబట్టి, దీనికా పేరు వచ్చింది భామహుడు చెప్పిన లక్షణంలాంటి లక్షణాలే భోజకుంతకాదులు కూడా చెప్పారు

సాహిత్యశబ్దానికి మరొకవిధంగా కూడా అర్థం చెప్పవచ్చునని ఆస్మదాదుల అభిప్రాయం రూపకాలను గూర్చి చెపుతూ భరతుడు-

"న తద్ జ్ఞానం న తచ్ఛిల్పం న సా విద్యా న సా కలా,

నాసౌ యోగో న తత్ కర్మ నాట్యేఽస్మిన్ యన్న దృశ్యతే" (నా.శా.1.116)

"నాట్యంలో, అనగా రూపకాలలో ప్రవేశపెట్టడానికి వీలుకాని జ్ఞానం కాని, శిల్పం కాని, విద్యకాని, కళగాని, యోగంగాని, కర్మగాని లేదు" అని అంటాడు. ఇంచుమించు ఇదే భావాన్ని ప్రకటిస్తూ భామహుడు -

"న స శబ్దో న తద్వాచ్యం న స న్యాయో న సా కలా,

జాయతే యన్న కావ్యాఙ్గమహో భారో మహాన్ కవేః" (కావ్యాలంకారం 5.4)

"కావ్యానికి అంగంగా ఉపయోగించని శబ్దంకాని, అర్థం కాని, న్యాయం కాని, కళ కాని లేదు; ఆహా! కవి నెత్తిమీద ఎంతబరువు ఉంది!" అని అంటాడు అనగా కావ్యంలో అవకాశాన్ని పట్టి ఎన్నో విషయాలు, శాస్త్రీయవిషయాలు; వైజ్ఞానికవిషయాలు, రాజకీయవిషయాలు, స్వదేశవిషయాలు, విదేశవిషయాలు చేరవచ్చు చరిత్ర పండితుడు ఆర్థికశాస్త్రం గురించి మాటలాడడు పిజిక్సులో పండితుడైన వాడు కెమిస్ట్రీని గూర్చి మాటలాడడు వైయాకరణుడు వేదాంతం గూర్చి మాటలాడడు వేదాంతపండితుడు రాజకీయవిషయాల్ని గూర్చి వ్రాయడు. కవికి ఈ నియమా లేవీ లేవు సమయానుకూలంగా అన్ని విషయాలూ కావ్యంలో ఇరికించవచ్చు. ఏవీ లేకుండా గాలి పోగు చేసి వ్రాయవచ్చు అందుచేత వివిధవిషయాల సాహిత్యం - కలయిక - ఉంది కాబట్టి వాఙ్మయానికి 'సాహిత్యం' అనీ, దానికి సంబంధించిన శాస్త్రానికి సాహిత్యశాస్త్రం అనీ పేర్లు వచ్చాయని చెప్పవచ్చు

ఏతావతా తేలిన దేమిటనగా (1) కావ్యంలో సౌందర్యం ఉండాలి. (2) సౌందర్యం ఉండాలంటే అలంకారాదులు ప్రవేశపెట్టాలి. (3) మాటలు తూచి తూచి వాడాలి (4) అర్థాలలో ఔచిత్యం ఉండాలి (5) ప్రపంచకంలో ఉన్న ఏ విషయాన్నైనా కావ్యవస్తువుగా ఎన్నుకోవచ్చు

తీపి, పులుపు మొదలైన వాటిని ఎవరిమట్టుకు వారు ఆస్వాదించి తెలుసుకోవలసిందే కాని మాటలలో స్పష్టీకరించడం అసంభవం చెరకురసం మధురంగా ఉంటుంది పాలు మధురంగా ఉంటాయి. బెల్లం మధురంగానే

ఉంటుంది కాని దాని లోని మాధుర్యం వేరు, దీనిలోని మాధుర్యం వేరు ఆ తేడా ఏమిటో మాటల్లో సరస్వతి కూడా చెప్పజాల దంటాడు దండి -

**"ఇక్షుక్షీరగుడాదీనాం మాధుర్యస్యాన్తరం మహత్,**

**తథాపి న తదాఖ్యాతుం సరస్వత్యాపి శక్యతే"** (కావ్యాదర్శం 1.102)

ఈ కోవకి చెందినదే సౌందర్యం అనేది కూడా అయితే మాఘకవి స్థూలంగా దీని కొక లక్షణం చెప్పాడు- **"క్షణే క్షణే యన్నవతాముపైతి తదేవ రూపం రమణీయతాయాః"**( శిశుపాలవధ **4.17**)"క్షణక్షణానికీ క్రొత్తగా కనిపించడమే సౌందర్యానికి లక్షణం" అని దీని భావం. ఈ లక్షణం ఒక ప్రాకృతికదృశ్యాన్ని వర్ణించే సందర్భంలో చెప్పినదే అయినా ఇది వాటికే కాకుండా కావ్యాదులకీ, లలితకళ లన్నింటికీ కూడా వర్తిస్తుంది

కావ్యానికి సంబంధించినంతవరకు- "ఏ గుణం ఒక కావ్యాన్ని మాటిమాటికీ చదివిస్తుందో అదే దానిలోని సౌందర్యం" అని చెప్పవచ్చు ఇలా చదివించేది, నవనవత్వాన్ని కలిగించేది ఏది అంటే - అది అలంకారప్రయోగం అని కొందరంటే రీతి (style) అని మరి కొందరన్నారు ధ్వని అని కొందరంటే వక్రోక్తి అని కొందరన్నారు అన్నింటినీ మించి రసం ఉండాలని కొందరూ, ఔచిత్యం ఉండాలని మరికొందరూ అన్నారు. ఈ విధంగా భారతీయసాహిత్యశాస్త్రంలో అలంకారసంప్రదాయం, రీతి సంప్రదాయం, ధ్వనిసంప్రదాయం, వక్రోక్తిసంప్రదాయం, రససంప్రదాయం, ఔచిత్యసంప్రదాయం అనే ఆరు సంప్రదాయాలు కనబడుతున్నాయి. అయితే- కొందరు ఒక సంప్రదాయంవైపు మొగ్గు చూపించారంటే వాళ్ళు కావ్యానికి సంబంధించిన ఇతరాంశాలని నిరాకరించారని అర్థం కాదు. కావ్యంలో అన్ని అంశాలూ ఉంటూండగా ప్రాధాన్యం మాత్రం ఒక దానికి ఇవ్వాలనీ, అది లేకపోతే ఇతరమైనవి అన్నీ ఉన్నా అది మంచి కావ్యం కాజాలదనీ వాళ్ల అభిప్రాయం ఇప్పుడు ఈ సంప్రదాయాలనుగూర్చి సంక్షిప్తంగా తెలుసుకొందాం

**అలంకారసంప్రదాయం** : ఈనాడు మనకు లభించే భారతీయసాహిత్యశాస్త్రానికి సంబంధించిన గ్రంథాలలో భరతుని నాట్యశాస్త్రం అతిప్రాచీనమైనది దీనికి ముందు అనేకగ్రంథాలు ఉన్నట్లు ప్రమాణాలు ఉన్నాయి కాని ఆ గ్రంథాలేవీ మన కిప్పుడు లభించడం లేదు భరతుడు నాట్యశాస్త్రంలో ఉపమ,

రూపకం, దీపకం అనే మూడు అర్థాలంకారాలు, యమకం అనే శబ్దాలంకారం- ఈ నాలుగు అలంకారాలు మాత్రమే పేర్కొన్నాడు. ఉపమతోపాటు చెప్పిన ఆ రెండు అలంకారాలూ కూడా ఉపమకు సంబంధించినవే నాట్యశాస్త్రం రచన క్రీ పూ రెండవ శతాబ్దం మొదలు, క్రీస్తుశకం మూడవ శతాబ్దం వరకూ జరిగి ఉంటుందని ఆధునిక విమర్శకుల అభిప్రాయం నాట్యశాస్త్రం తరవాత అలంకారశాస్త్రచరిత్రలో దాదాపు ఆరుశతాబ్దాల స్తబ్దత, అవకాశం, కనబడుతుంది ఆ కాలానికి సంబంధించిన గ్రంథా లేవీ మనకు లభించడం లేదు. ఆరవ శతాబ్దం నుంచి భామహ-దండి-వామనాదుల గ్రంథాలు లభిస్తున్నాయి. ఈ గ్రంథాలలో అలంకారాల సంఖ్య క్రమక్రమంగా పెరిగి 17వ శతాబ్దంలో అప్పయ్యదీక్షితులు కువలయానందం రచించేనాటికి ఎన్నో అవాంతరభేదాలతో 125 కి చేరుకుంది

"మంచి నటనపాటవం ఉన్న నటి వేషాలు మారుస్తూ నాట్యరంగం మీద అనేక రూపాలలో కనబడ్డట్లు ఉపమ అనేకరూపాలు దాలుస్తూ రూపకోత్ప్రేక్షాది నామధేయాలతో సహృదయహృదయాలను ఆనందింపచేస్తూ ఉంటుంది అందుచేత ఉపమ సర్వాలంకారమూలం" అని అంటారు అప్పయ్యదీక్షితులు·-

**"ఉపమైకా శైలూషీ సంప్రాప్తా చిత్రభూమికాభేదాన్,**
**రఞ్జయతి కావ్యరఙ్గే నృత్యన్తీ తద్విదాం చేతః."**(చిత్రమీమాంస పేజీ 6)

"ముఖం చంద్రబింబంలాగ ఉన్నది" అని సాదృశ్యాన్ని వర్ణిస్తే అది ఉపమాలంకారం అయింది ఈ భావాన్నే మరొక విధమైన మాటల్లో ప్రకటిస్తే వేరు వేరు అలంకారాలు అవుతాయి "ముఖం చంద్రబింబంలాగ ఉన్నది; చంద్రబింబం ముఖంలాగ ఉన్నది" అని వర్ణిస్తే ఉపమేయోపమాలంకారం (వీటితో పోల్చడానికి తగిన మూడవ వస్తువు లేదని భావం). "ముఖం ముఖంలాగ ఉన్నది"- అనన్వయాలంకారం (దీనితో పోల్చడానికి తగిన మరొక వస్తువు లేదని భావం) "చంద్రబింబం ముఖంలాగ ఉన్నది" - ప్రతీపాలంకారం "చంద్రబింబాన్ని చూడగానే ముఖం గుర్తుకు వస్తూన్నది" - స్మరణాలంకారం "ముఖమే చంద్రబింబం" - రూపకం "ముఖచంద్రుడు తాపాన్ని శమింపచేస్తున్నాడు" - పరిణామాలంకారం. "ఇది ముఖమా చంద్రబింబమా?"- సందేహాలంకారం "చంద్రబింబం అనుకొని చకోరపక్షులు నీ ముఖంవైపు పరుగెత్తుతున్నాయి" - భ్రాంతిమదలంకారం "చంద్రు డనుకొని చకోరాలు, కమలం అనుకొని

తుమ్మెదలూ నీముఖం మీద ఆసక్తి చూపుతున్నాయి''- ఉల్లేఖాలంకారం ''ఇది చంద్రబింబమే, ముఖం కాదు''- అపహ్నవాలంకారం. ''ఇది నిజంగా చంద్రబింబమే అయి ఉంటుంది''- ఉత్ప్రేక్షాలంకారం ''ఇదిగో చంద్రుడు''- అతిశయోక్త్యలంకారం ''ముఖం చంద్రుణ్ణీ కమలాన్నీ జయించింది''- తుల్యయోగితాలంకారం ''రాత్రివేళ నీ ముఖమూ, చంద్రుడూ హర్షిస్తున్నాయి''- దీపకం. ''నాకు నీ ముఖం అంటేనే ఇష్టం, చకోరానికి చంద్రుడంటేనే ఇష్టం''- ప్రతివస్తూపమాలంకారం. ''ఆకాశంమీద చంద్రుడు, భూలోకంలో నీముఖమూ''- దృష్టాంతాలంకారం ''ముఖంలో చంద్రశోభ ఉన్నది''- నిదర్శనాలంకారం ''కలంకం లేని ముఖం చంద్రుణ్ణీ మించింది''- వ్యతిరేకాలంకారం ''రాత్రులలో చంద్రుడు నీ ముఖంతో పాటు హర్షిస్తున్నాడు''- సహోక్త్యలంకారం ''నీముఖం ముందు చంద్రుడు కాంతివిహీనుడు''- అప్రస్తుత ప్రశంసాలంకారం. ఈవిధంగా ఉపమాలంకారంలోనుంచి ఎన్నో అలంకారాలు ఉద్భవించాయని అప్పయదీక్షితులు ప్రదర్శించారు. అర్థాలంకారాలన్నీ వాస్తవం అనగా వస్తుస్థితి, ఔపమ్యం, అతిశయం, శ్లేష అనే నాలుగు అంశాలలో ఏదో ఒకదాని మీద ఆధారపడి ఉంటాయని రుద్రటుడు కావ్యాలంకారంలో అంటాడు.

> **''అర్థస్యాలంకారా వాస్తవమౌపమ్యమతిశయః శ్లేషః,**
> **ఏషామేవ విశేషా అన్యే తు భవన్తి నిఃశేషాః''** (కావ్యాలంకారం 7.9)

ఉపమాదులన్నీ అర్థానికి సంబంధించిన అలంకారాలు అవడం చేత వీటికి అర్థాలంకారాలని పేరు కొన్ని వర్ణాలని వాక్యాలలో నియతస్థానాలలో కాని, అనేక పర్యాయాలు కాని ఆవృత్తి చేసినా, కొన్ని వర్ణసముదాయాలని ఆవృత్తి చేసినా ప్రాస, వృత్త్యనుప్రాస, యమకం మొదలైన శబ్దాలంకారాలు ఏర్పడతాయి

జాగర్తగా పరిశీలించి చూస్తే ప్రపంచకంలోని ప్రతీసాహిత్యంలోను భాష పుట్టినది మొదలు నేటివరకూ ఈ అలంకారాలు రాజ్యం ఏలుతున్నాయంటే అతిశయోక్తి కాదు రీతి-ధ్వని సంప్రదాయాదులు ఎన్ని వచ్చినా అవి కావ్యంలో ఈ అలంకారాలకి ఇవ్వవలసిన స్థానం ఇస్తూనే ఉన్నాయి అందుచేతనే- ''అలంకారాలు లేకపోయినా కావ్యం కావచ్చును అనుకొనే వాళ్ళు నిప్పు వేడి లేకుండా కూడా ఉండవచ్చును అనుకొనేవాళ్ళే'' అని అంటాడు జయదేవుడు చంద్రాలోకంలో-

**"అంగీకరోతి యః కావ్యం శబ్దార్థావనలంకృతీ,**
**అసౌ న మన్యతే కస్మాదనుష్ణమనలం కృతీ"** (చం ఆ 1.8)

ఇప్పుడు కొన్ని అలంకారాలకి ఉదాహరణలు చూద్దాం-

**"లిమ్పతీవ తమోఽఙ్గాని వర్షతీవాఞ్జనం నభః,**
**అసత్పురుషసేవేవ దృష్టిర్నిష్ఫలతాం గతా"** (కావ్యాదర్శం 2 362 )

చీకటిని వర్ణిస్తూన్న శ్లోకం ఇది "చీకటి ఒంటికి అంటుకొంటూందా అన్నట్లు ఉంది ఆకాశం కాటుక వర్షిస్తున్నదా అన్నట్లుంది చెడ్డవానికి చేసిన సేవవలె చూపు వ్యర్థం అయిపోయింది."

పూర్వార్ధంలో రెండు ఉత్ప్రేక్షాలంకారాలూ, ఉత్తరార్ధంలో ఉపమాలంకారమూ ఉన్నాయి చీకటి ఎంత దట్టంగా ఉందో మనకు ఈ అలంకారాలద్వారా కలిగిన జ్ఞానం "బాగా చీకటిపడింది" అని నొక్కి పదిమాట్లన్నా కలగదు ఉపమాలంకారం చీకటి ప్రభావాన్ని సూచిస్తూ మనల్ని దుష్టుడూ, వానికి చేసిన సేవా, దాని నిష్ఫలత్వమూ మొదలైన మరొక భావనాప్రపంచకంలోనికి తీసికొనిపోతుంది

అతిశయోక్తికి ఒక ఉదాహరణం -

**ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే,**
**తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యోఽభిచాకశీతి.**
(ముండకోపనిషత్ 3.1)

"స్నేహంగా ఎప్పుడూ కలిసి ఉండే రెండు పక్షులు ఒకే వృక్షాన్ని ఆశ్రయించుకొని ఉన్నాయి వాటిలో ఒకటి మధురమైన ఫలం తింటూ ఉంటే రెండవది తినకుండా చూస్తూ ఉంటుంది "

ఇక్కడ రెండు పక్షు లనగా జీవాత్మ పరమాత్మలు అని వినిపించే వృక్షం శరీరం జీవుడు కర్మఫలం అనుభవిస్తూ ఉంటే పరమాత్మ సాక్షిమాత్రుడుగా చూస్తూ ఉంటాడు అని దీని భావం

"జీవాత్మ పరమాత్మ లనే రెండు పక్షులు శరీరం అనే వృక్షాన్ని ఆశ్రయించుకొని ఉన్నాయి జీవాత్మ అనే పక్షి కర్మఫలం అనే ఫలాన్ని తింటూ ఉంటే పరమాత్మ లనే పక్షి చూస్తూ ఉంటుంది" అని చెప్పినట్లయితే ఇది 'రూపకాలంకారం'

అవుతుంది. అలా చెప్పకుండా ఉపమేయాలైన జీవాత్మాదుల్ని పూర్తిగా మింగేసి పక్ష్యాదులైన ఉపమానాలనే నిర్దేశించడంచేత ఇది 'అతిశయోక్తి' అయింది ఇది అతిశయోక్తిభేదాలలో ఒకటి దీనికి 'రూపకాతిశయోక్తి' అని కూడా పేరు

భగవద్గీత నుంచి మరొక ఉదాహరణం చూద్దాం -

**"యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ".**(భ. గీ. 2.69)

"ఇతరులందరికీ ఏది రాత్రియో ఆ సమయంలో జ్ఞాని మెలకువగా ఉంటాడు ఇతరు లందరూ ఎప్పుడు మెలకువగా ఉంటారో అది చూస్తూండే జ్ఞానికి రాత్రి" అని దీని అర్థం.

"ఈ లౌకికవ్యవహారానికి అతీతం అయిన పారమార్థికజ్ఞానస్థితి ఒకటి ఉంది. అజ్ఞాను లందరికీ అది రాత్రివంటిది. దానిలో జ్ఞాని మేల్కొని ఉంటాడు. ఇతరు లందరూ మేల్కొని ఉన్న లౌకికవ్యావహారికస్థితి జ్ఞానికి రాత్రివంటిది. ఆ వ్యవహారం అత డేమీ పట్టించుకొనడు. అయితే చూస్తూనే ఉంటాడు. కాని అతడు చూచేది లౌకికవ్యవహారం వెనక ఉన్న పారమార్థికతత్త్వం" అని దీని భావం ఇక్కడ కనబడే రాత్రి', 'మేల్కోవడం' 'చూడడం' ఇవన్నీ మామూలు రాత్ర్యాదులు కావు అందుచేత ఇక్కడ కూడా రూపకాతిశయోక్తి కనబడుతుంది

ఆలంకారికులు ప్రసిద్ధంగా ఇచ్చే మరొక ఉదాహరణ

**"వాపీ కాపి స్ఫురతి గగనే తత్పరం సూక్ష్మపద్యా**
**సోపానాలీమధిగతవతీ కాఞ్చనీమైన్ద్రనీలీ,**
**అగ్రే శైలౌ సుకృతిసుగమౌ చన్దనచ్ఛన్నదేశౌ**
**తత్రత్యానాం సులభమమృతం సంనిధానాత్సుధాంశోః"** .

(కువలయానందం పే 38)

"ఆకాశంలో ఒక దిగుడు బావి దాని తరవాత బంగారు మెట్ల మీదుగా ఇంద్ర నీలమాణిక్యాల కాలిబాట దాని తరవాత పుణ్యాత్ములకు మాత్రమే లభ్యం అయ్యే చందనాచ్ఛాదితాలైన రెండు పర్వతాలు అక్కడిదాకా వెళ్లిన వాళ్లకి చంద్రుడు దగ్గరగా ఉండడంచేత అమృతం అనాయాసంగా లభిస్తుంది " ఇక్కడ ఆకాశ-వాపీ-సువర్ణ సోపాన-పర్వతద్వయాదులు వేటిని సూచిస్తున్నాయో సహృదయులకు చెప్పవలసిన

పనిలేదు ఇక్కడకూడా రూపకాతిశయోక్త్యలంకారమే ఆధునికసాహిత్యాలని గూర్చి ముచ్చటించుకొనేటప్పుడు ఈ అలంకారం చాలా ఉపయోగిస్తుంది. అందుచేతనే ఇన్ని ఉదాహరణలు చూపడం జరిగింది

**రీతిసంప్రదాయం:–** భరతుడు నాట్యశాస్త్రంలో శ్లేష, ప్రసాదం, సమత, సమాధి, మాధుర్యం, ఓజస్సు, పదసౌకుమార్యం, అర్థవ్యక్తి, ఉదారత, కాంతి అనే పది గుణాలు ప్రతిపాదించాడు దండి కూడా వీటినే అంగీకరించాడు వీటిలో కొన్ని శబ్దగుణాలు గాను, కొన్ని అర్థగుణాలుగాను కనబడతాయి అయితే వామనుడు ఇవే పేర్లతో పది శబ్దగుణాలూ, పది అర్థగుణాలూ అంగీకరించాడు అలంకారాలు కావ్యానికి శోభను కూరుస్తాయి అని దండి, భామహాదులు అంటే "కావ్యానికి శోభ అనేది గుణాలవల్లనే కలుగుతుంది, గుణాలవల్ల కలిగిన ఆ శోభను అలంకారాలు పెంపొందిస్తాయి" అని వామనుడు అన్నాడు ఈతని అభిప్రాయం ప్రకారం గుణాలు లేకుండా అలంకారాలు మాత్రమే కూరుస్తే అది వృద్ధురాలి శరీరం మీద ఉన్న అలంకారాల వలె శోభావిహీనంగా ఉంటాయి "కావ్యానికి రీతియే ఆత్మ" అని వామనుని సిద్ధాంతం రీతి అంటే విశిష్టమైన, అనగా విశేషం ఉన్న పదరచన, పదాల కూర్పు గుణాలు ఉండడం అనేదే విశేషం అనగా గుణాలు ఉన్న పదరచన - పదాల కూర్పు- రీతి అని అర్థం

రీతికి ప్రాచీననామధేయం 'మార్గం' 'రీతి' అన్నా 'మార్గం' అన్నా ఒకటే ఆంగ్లంలో దీనినే style అంటారు రీతిశబ్దాన్ని ప్రప్రథమంగా ప్రయోగించినవాడు వామనుడు దండి వైదర్భమార్గం, గౌడీయమార్గం అనే రెండు మార్గాలు పేర్కొని మొదటిది దాక్షిణాత్యమార్గం అనీ, అదే ఉత్కృష్టమైనదనీ, రెండవది పౌరస్త్యుల (తూర్పుదేశంవాళ్ళ) మార్గమనీ ప్రతిపాదించాడు "ఒక మార్గం మంచిది, రెండవది మంచిది కాదు" అని చెప్పడం సమంజసం కాదు, "సరిగా నడిపితే రెండు మార్గాలూ మంచివే" అని అంటాడు భామహుడు వామనుడు 'వైదర్భి', 'గౌడీయ', 'పాంచాలి' అనే మూడు రీతులు అంగీకరించి దండిమతాన్నే అనుసరిస్తూ వైదర్భరీతి అత్యుత్తమమైనదని ప్రతిపాదించాడు "ఈ వైదర్భరీతిని అలవరచుకోవడానికి మొదటినుండీ ప్రత్యేక శ్రద్ధ తీసికోవాలి గౌడ-పాంచాలరీతులలో కొంతకాలం అలవాటు చేసికొన్నట్లయితే ఎప్పటికైనా వైదర్భి అలవడుతుందనే ఆశ పనికి రాదు జనపనారతో నేయడం ఎన్నాళ్ళు నేర్చినా పట్టు బట్టలు నేసే నేర్పు రాదు కదా?" అని అంటాడు

కుంతకుడు ఈ మూడు రీతులకీ బదులు సుకుమారం, విచిత్రం, మధ్యమం అని మూడు మార్గాలు అంగీకరించాడు. అయితే వీటిని గుణాలతో ముడిపెట్టకుండా వీటి లక్షణాలు మరొకవిధంగా ప్రతిపాదించాడు. కవులల్లో కొందరు సుకుమారప్రవృత్తికలవాళ్లు ఉంటారు. వాళ్ల ఆలోచనలూ, వ్యవహారాలూ, రచనలూ కూడా సుకుమారంగానే ఉంటాయి వాళ్లు అనుసరించే మార్గం సుకుమారమార్గం. విచిత్రమైన మనఃప్రవృత్తికలవాళ్ళు కూడా కొందరుంటారు వాళ్ల మార్గం విచిత్రమార్గం. ఈరెండు విధాల ప్రకృతులూ ఉన్నవాళ్ల మార్గం మధ్యమార్గం ఇలాంటి మూడు విధాల మనుష్యులు అన్నిదేశాలలోను, అన్ని ప్రాంతాలలోనూ కూడా ఉండవచ్చు అందుచేత ఈ మార్గాలకి గాని, రీతులకి గాని దేశాల పేర్లు పెట్టడం యుక్తం కాదంటాడు కుంతకుడు

ఈ రీతిలో, అనగా పదగుంఫనలో ఒకానొక అనిర్వచనీయమైన సౌందర్యం ఉంటుంది అర్థంలో అంతగా చమత్కారం లేకపోయినా ఆ లోపాన్ని రీతిసౌందర్యం కప్పివేస్తుంది అని అంటాడు వామనుడు. ఇంతకీ కవి ఇక్కడ ఏమి చెప్పాడు? అని వెనక్కి తిరిగి చూసుకుంటే ఏమీ కనబడకపోయినా ఏదో ఉన్నట్లు కనబడుతుందట వింటూన్నంతసేపూ-

"కిం త్వస్తి కాచిదపరైవ పదానుపూర్వీ
యస్యాం న కించిదపి కించిదివావభాతి" (కా సూ 1.2.21)

వామనుడు అన్నట్లుగా "రీతియే కావ్యాత్మ" అని అనకపోయినా రీతికి, అనగా పదగుంఫనకు, ఉన్న ప్రాధాన్యాన్ని భామహాది ప్రాచీనాలంకారికులు కూడా గుర్తించారు ఒక మాలాకారుడు చాలా రకాల పువ్వులు తెచ్చి, ఎదట ప్రోగుచేసికొని, మాలకట్టడం ప్రారంభించి, "ఈ పువ్వు తరవాత ఇది రావాలి, దీనితరవాత ఇది బాగుండదు; ఈ పువ్వు అసలే పనికి రాదు, దీని చోటు ఇది" అని ఏరుతూ అందమైన పుష్పమాల రచించినట్లు కవికూడా ఎక్కడ ఏ పదం వాడాలో ఏది వాడ కూడదో సావధానచిత్తంతో గుర్తించి కావ్యరచన చెయ్యాలి అని అంటాడు భామహుడు-

"ఏతద్గ్రాహ్యం సురభి కుసుమం, గ్రామ్యమేతన్నిధేయం
ధత్తే శోభాం విరచితమిదం, స్థానమస్యైతదస్య,
మాలాకారో రచయతి యథా సాధు విజ్ఞాయ మాలాం
యోజ్యం కావ్యేష్వవహితధియా తద్వదేవాభిధానమ్." (కావ్యా 1.59)

సొగసుగా కవిత్వం వ్రాయాలనుకొనే ప్రతివాడూ నేడు కూడా జ్ఞాపకం

ఉంచుకోవలసిన విషయం ఇది

రీతులకు రెండు ఉదాహరణలు దీర్ఘసమాసాలూ, పరుషవర్ణాలూ లేకుండా సుకుమారమైన పదాలతో చదువుతుండగానే అర్థం అయేటట్లుగా ఉన్న రీతి వైదర్భి దీనిలో శ్లేషాదిగుణాలు చాలావరకు ఉంటాయి  ఉదా -

"గాహన్తాం మహిషా నిపానసలిలం శృఙ్గైర్ముహుస్తాడితం
ఛాయాబద్ధకదమ్బకం మృగకులం రోమన్థ మభ్యస్యతు,
విస్రబ్ధం కురుతాం వరాహవితతిర్ముస్తాక్షతిం పల్వలే
విశ్రాన్తిం లభతామిదం చ శిథిలజ్యాబన్ధమస్మద్ధనుః."
(అభిజ్ఞానశాకుంతలం 2.6)

దీర్ఘసమాసాలతో పరుషవర్ణప్రాయంగా ఉన్న రీతి గౌడరీతి దీనిలో ఓజోగుణాధిక్యం ఉంటుంది  ఉదా:-

"దోర్దణ్డాఞ్చితచన్ద్ర శేఖరధనుర్దణ్డావభఙ్గోద్యత
ష్టఙ్కారధ్వనిరార్యబాలచరితప్రస్తావనాడిణ్డిమః,
ద్రాక్పర్యస్తకపాలసంపుటమితబ్రహ్మాణ్డభాణ్డోదర
భ్రామ్యత్పిణ్డితచణ్డిమా కథమహో నాద్యాపి విశ్రామ్యతి."
(కా సూ.1.2 12)

ఈ రెండింటి మధ్యేమార్గంలో నడిచేది పాంచాలి ప్రతిపాదించే(వర్ణించే) విషయానికీ, రసాదులకీ అనుగుణంగా ఈ రీతుల్ని ఉపయోగించాలనేది సర్వాలంకారిక సంమతం

**ధ్వనిసంప్రదాయం** - ధ్వనిని గూర్చి మాటలాడడానికి ముందు ఆలంకారికులు అంగీకరించిన శబ్దవృత్తుల సంక్షిప్త పరిచయం అవసరం. ప్రతిశబ్దమూ ఒక అర్థాన్ని బోధిస్తుంది. ఈ బోధించడం అనే పనికి 'వ్యాపారం' లేదా 'వృత్తి' అని పేరు "ఈ శబ్దానికి ఇది అర్థం" అని చేసుకొన్న నియమానికి 'సంకేతం' అని పేరు. ఒక శబ్దాన్ని విడిగా ఉపయోగించినప్పుడు అది సంకేతితమైన అర్థాన్ని మాత్రమే బోధిస్తుంది అలా బోధించే వృత్తికి 'అభిధ' అని పేరు అభిధావృత్తి చేత బోధించబడిన అర్థానికి 'అభిధేయం' లేదా 'వాచ్యం' అని పేరు ఆ శబ్దమే కొన్ని సందర్భాలలో తన ప్రక్కన చేర్చిన విశేషణాన్ని, లేదా క్రియాపదాన్ని పట్టి మరొక అర్థాన్ని బోధిస్తుంది ఇలా మరొక అర్థాన్ని బోధించడం అనే వ్యాపారానికి (వృత్తికి) లక్షణావృత్తి అని పేరు లక్షణావృత్తి చేత బోధించబడిన అర్థానికి 'లక్ష్యార్థం' అని

పేరు ఉదాహరణకి- 'గ్రామం' అని వివిక్తపదంగా ఉపయోగించినా 'అతడు గ్రామానికి వెడుతున్నాడు' అని వాక్యంలో ప్రయోగించినా 'గ్రామ' శబ్దానికి 'ఊరు' అని మాత్రమే అర్థం. ఇది వాచ్యార్థం అయితే 'గ్రామం' కదలివచ్చింది అనే వాక్యంలో 'గ్రామ' శబ్దానికి 'ఊరు' అని అర్థం కాదు, 'ఊరిలోని జనం' అని అర్థం 'గ్రామం తగులబడిపోయింది' అనే వాక్యంలో 'గ్రామ' శబ్దానికి "గ్రామంలోని ఇళ్లు" అని అర్థం ఈవిధంగా అభిధావృత్తిచేత ఊరు అనే అర్థాన్ని బోధించే గ్రామశబ్దమే పై వాక్యాలలో తన ప్రక్కన ఉన్న పదాలనుపట్టి, లక్షణావృత్తిచేత గ్రామంలోని జనం, గ్రామంలోని ఇళ్ళు అనే అర్థాన్ని బోధించింది. రెండు వస్తువులలో ఉన్న గుణాల పోలికలను పట్టిగాని, వాటిమధ్య ఉన్న కార్యకారణభావాన్ని పట్టిగాని ఒకదానిమీద రెండవదాన్ని ఆరోపిస్తారు. ఇది కూడా లాక్షణికప్రయోగమే. ఉదాహరణకి - "ఆ యోధుడు పులి", "ఈ అధికారి నిప్పు", "వా డొక మొద్దు", "మామిడిపండు రసం అంతా బలమే" ఇత్యాదిప్రయోగాలు ఈ విధమైన ఆరోపణలవల్ల ఏర్పడినవే వీటిని "ఔపచారికప్రయోగాలు" అని కూడా అంటారు. "చాలా అందంగా, ప్రభావవంతం (Powerful) గా ఉన్నది" అని మనం మెచ్చుకొనే ప్రతిరచనలోనూ కూడా- అది ఏ భాషలోనైనా ఉండవచ్చు; కావ్యంకాని, నాటకంగాని, నవలగాని, కథానికగాని, మంచిపత్రికాసంపాదకుడు వ్రాసే సంపాదకీయంగాని, వ్యాసంకాని కావచ్చు. అన్నింటిలోనూ కూడా - ఈ లాక్షణికపదాలప్రయోగం అత్యధికంగా ఉంటుంది. కేవలవాచ్యప్రధానంగా ఉన్నవి పేలవంగానే ఉంటాయి. జాగర్తగా పరిశీలిస్తే సామెత లన్నింటిలోనూ, నానుడి అనేవాటిల్లోనూ, idioms లోనూ కూడా డెబ్భైయైదుశాతం ఈ లాక్షణికపదాల సామ్రాజ్యం కనబడుతుంది ఇది అన్ని భాషలలోనూ కూడా కనబడే వైచిత్ర్యం "నీ పప్పులు నా దగ్గర ఉడకవు", "పప్పులో కాలేశాడు", "వాడు వెళ్ళి ఆయన చెవి కొరికాడు", "బంకిపీషాణం", "పట్టుకొన్నాడంటే వదలడు", "నీళ్ళు పోసుకుంది", "దీపం కొండెక్కింది", "Do not wag your tail", The phone is dead", "Do not lose your heart", "I put the bug into his ear", "back-biting" ఇత్యాదులన్నీ లాక్షణికప్రయోగాలే ఈ లక్షణావృత్తికీ, లాక్షణిక ప్రయోగాలలో ఉన్న అనేకభేదాలకీ సంబంధించిన చర్చ అతివిస్తృతంగా అలంకారశాస్త్రగ్రంథాలలో ఉంది దాని జోలికి పోకుండా ఇప్పు డింక ధ్వని అంటే ఏమిటో చూద్దాం

ఒక వాక్యం వినగానే ఆ వాక్యంలో ఉన్న పదాల వాచ్యార్థాలూ, లక్ష్యార్థా లేవైనా ఉంటే అవీ తెలిసిన తరవాత కూడా కొన్ని కొన్ని సందర్భాలలో ఇంకా ఏదో అర్థం మనస్సుకు స్ఫురిస్తూ ఉంటుంది దేవాలయానికి వెళ్లి గంట ప్రయోగించగానే ఘంటా-దండసంబంధంవల్ల పుట్టిన ప్రథమశబ్దమే కాకుండా గుఁయ్, గుఁయ్ అని ఒక ధ్వని కొంతసేపు వినబడుతుంది దానికి అనురణనధ్వని అని పేరు ఆ అనురణన ధ్వని వంటిదే ఈ స్ఫురించే అర్థం ఇలా స్ఫురించే అర్థానికీ, స్ఫురింపచేసే శబ్దవ్యాపారానికీ కూడా 'ధ్వని' అనే పేరు. 'ధ్వని' అనే వృత్తికీ, 'ధ్వని' అనే అర్థానికీ వరసగా 'వ్యంజన', 'వ్యంగ్యార్థం' అనే పేర్లు కూడా ఉన్నాయి పైన ఉదాహరించిన మొదటి వాక్యంలో లక్షణావృత్తి చేత- "గ్రామస్థులందరూ తరలివచ్చారు" అనే అర్థం తెలిసిన తరవాత "వాళ్ళందరూ అత్యధికసంఖ్యలో, ఐకమత్యంతో, ఏదో కార్యం సాధించాలన్న దృఢసంకల్పంతో వచ్చారు" అనే అర్థం కూడా స్ఫురిస్తుంది. రెండవవాక్యంలో "ఒక ఇల్లు కాదు, రెండు ఇళ్లు కాదు, చాలా ఇళ్లు కాలిపోయాయి" అనే అర్థం స్ఫురిస్తుంది ఇది వ్యంగ్యార్థం ఇదే ధ్వని. కళాశాలలో ఒక ఉపన్యాసకుడు ట్యుటోరియల్ క్లాసు తీసికొని, యాభై అరవైమంది విద్యార్థులచేత వ్యాసాలు వ్రాయించి ఆ నోట్ పుస్తకాలన్నీ కట్టకట్టి తీసికొని వెడుతున్నాడు దారిలో ఒక కొంటె విద్యార్థి కలసి- "మాస్టారూ! గాడిద బరువు మోసుకుపోతున్నారే!" అన్నాడట నవ్వుతూ. వెంటనే ఆ ఉపన్యాసకుడు "ఇది అరవైగాడిదల బరువు" అన్నాడట ఈ విధంగా సమయస్ఫూర్తీ, వాక్చాతుర్యమూ ఉన్న ఛేకుల మాటల్లో ఈలాంటి ధ్వని ఉంటుంది. అంతే కాదు బావమరదుల పరిహాసవాక్యాలలోను, బావామరదళ్ల పరియాచకాలలోను, తదితర సామాన్య సంభాషణాదులలోనూ కూడా ఈ ధ్వని గోచరిస్తుంది.

తొమ్మిదవ శతాబ్దానికి చెందిన ఆనందవర్ధనుడు ఈ ధ్వనికి ఒక నిర్దిష్టరూపం సంతరించి ధ్వనియే కావ్యాత్మ అనే సిద్ధాంతాన్ని 'ధ్వన్యాలోకం' అనే గ్రంథంలో ప్రతిపాదించాడు ఈ ధ్వనికి అనుగుణంగా గుణాలంకారాదులకి కూడా కావ్యంలో తగిన స్థానం చూపించాడు ధ్వనిని ఆనందవర్ధనుడు స్థూలంగా 'సంలక్ష్యక్రమధ్వని', 'అసంలక్ష్యక్రమధ్వని' అని రెండు విధాలుగా విభజించాడు ఒక వాక్యంలోని వాచ్యార్థ లక్ష్యార్థాదులు తెలిసిన తరువాత స్ఫురించే వ్యంగ్యార్థానికి 'సంలక్ష్యక్రమధ్వని' అని పేరు అనగా వాచ్యార్థజ్ఞానం ముందూ, తరవాత వ్యంగ్యార్థజ్ఞానం అనే క్రమం స్పష్టంగా

తెలుస్తుంది క్రమం ఉన్నా కూడా ఉన్నట్లు తెలియని విధంగా వాచ్యార్థంతో పాటే స్ఫురించినట్లు కనబడేది "అసంలక్ష్యక్రమధ్వని" నూరుతామరపూవురేకులు ఒకదానిమీద ఒకటి బొత్తిగా పెట్టి వాడియైన సూదితో గ్రుచ్చినప్పుడు ఆ సూది ఆ రేకులలో ఒకదాని తరవాత ఒకటి చొప్పునే గుచ్చుకొని అడుగుకు దిగుతుంది కాని వేగవశంచేత నూరురేకులూ కూడా ఒకే సమయంలో గ్రుచ్చబడ్డట్లు అనుకుంటాం అనగా ఇక్కడ ఉన్న క్రమం గుర్తించడానికి వీలుకాకుండా ఉన్నదన్నమాట అదేవిధంగా కొన్నిచోట్ల వాచ్యార్థవ్యంగ్యార్థజ్ఞానాల క్రమాన్ని గుర్తించనప్పుడు ఆ ధ్వని 'అసంలక్ష్యక్రమధ్వని' 'వస్తుధ్వని', 'అలంకారధ్వని' అని సంలక్ష్యక్రమధ్వని రెండు విధాలు రసధ్వని అసంలక్ష్యక్రమం రసధ్వని అన్నప్పుడు కేవలం శృంగారాది నవరసాల ధ్వనిమాత్రమే కాదు; రసం, భావం, రసాభాసం, భావాభాసం, భావోదయం ( భావం పుట్టడం), భావశాంతి ( భావం శమించడం) భావసంధి (రెండు భావాల కలయిక), భావశబలత (రెండుకంటె ఎక్కువ భావాల కలయిక)- వీటి అన్నింటి ధ్వనినీ గ్రహించాలి. ఈ రసభావాదిధ్వని అసంలక్ష్యక్రమం అవుతుంది వీటిని గూర్చి తరవాత చెప్పుకుందాం.

ఒక వాక్యం విన్నప్పుడు వాచ్యార్థం కంటె భిన్నంగా, నిషేధాత్మకం కాని, విధ్యాత్మకంగాని, తటస్థరూపం కాని అయిన మరొక విషయం ఏదైనా శ్రోతకు స్ఫురిస్తే అది 'వస్తుధ్వని'; అలంకారం స్ఫురిస్తే 'అలంకారధ్వని' ఉదాహరణకి - ఒక సంన్యాసి గోదావరీ తీర నికుంజాలలో ఉన్న పువ్వులు కోసుకోవడం కోసం ఆ ప్రాంతంలో తిరుగుతూ ఉంటాడు అయితే ఆ ప్రాంతాన్నే ప్రియసమాగమానికి సంకేతస్థానంగా చేసుకొన్న ఒక నాయికకు ఆ సంన్యాసి వస్తూ ఉండడం వల్ల కొంత ఇబ్బంది కలుగుతుంది అతడు ఆ చుట్టు ప్రక్కలకి రాకుండా చెయ్యాలనే ఉద్దేశ్యంతో ఆమె ఇలా అంటుంది-

"భ్రమ ధార్మిక విస్రబ్ధం స శునకో౽ద్య మారితస్తేన ,
గోదావరీతీరలతాకుఞ్జనివాసినా దృప్తసింహేన".

ఇది గాధాసప్తశతిలోని ప్రాకృతగాధకి సంస్కృతానువాదం "ఓ ధార్మికుడా! ఇటుపైన నువ్వు బయం ఏమీ లేకుండా ఈ ప్రాంతంలో తిరగవచ్చు నువ్వు ఏ కుక్కను చూచి భయపడుతూ భయపడుతూ వచ్చేవాడవో ఆ కుక్కని లతాకుంజాలలో నివసిస్తూన్న సింహం చంపేసింది" అని దీని వాచ్యార్థం. "నువ్వు కుక్కకే

భయపడేవాడివి, ఇక్కడ సింహం ఉంది నువ్వు ఈ ప్రాంతాలకి రావడం మంచిది కాదు" అన్న విషయం (వస్తువు) ధ్వనిస్తూన్నది అందుచేత ఇది వస్తుధ్వని ఇలాంటి అర్థం స్ఫురించాలంటే శ్రోతకి అక్కడ ఉన్న సందర్భము, మాటలాడిన వ్యక్తి స్వభావాదులూ తెలిసి ఉండాలి. అందుచేత ఈ అర్థం స్ఫురించడంలో కొంచెం ఆలస్యం ఉంటుంది కాబట్టి ఇది 'సంలక్ష్యక్రమధ్వని' ఇంక అలంకారధ్వనికి ఒక ఉదాహరణం-

**"నిరుపాదానసంచార మభిత్తావేవ తన్వతే,**
**జగచ్చిత్రం నమస్తస్మై కలాశ్లాఘ్యాయ శూలినే."**

"ఏ సాధనసామగ్రీ లేకుండా, ఆధారమైన గోడ కూడా లేకుండా, జగత్తు అనే చిత్రాన్ని నిర్మించే, కలాశ్లాఘ్యుడైన పరమేశ్వరుడికి నమస్కారం".

ఇక్కడ ఇతరశిల్పులందరి కంటె పరమేశ్వరుడు చాలా గొప్పవాడనే వ్యతిరేకాలంకారం ధ్వనిస్తూన్నది అందుచేత ఇది అలంకారధ్వని ఈ విధంగా కావ్యానికి 'ధ్వనియే ఆత్మ' అని ఆనందవర్ధనుడు ప్రతిపాదించాడు అయితే వాచ్యార్థాన్ని బోధించే అభిధకి కావ్యంలో చోటు లేదని అర్థం కాదు వాచ్యార్థంతో పాటు అక్కడక్కడ ధ్వని స్పర్శ ఉంటేనే కావ్యం చమత్కారంగా ఉంటుందని ఈ సిద్ధాంతంలోని అభిప్రాయం

**వక్రోక్తిసంప్రదాయం:-** 'వక్రోక్తి' శబ్దాన్ని ఒక అలంకారానికి పేరుగా సంకుచితార్థంలో ప్రయోగించడం ఉంది ఎవరైనా అన్నమాటలు అటూ ఇటూ విరిచి మరొక అర్థం వచ్చేటట్టు చెప్పడం 'వక్రోక్త్యలంకారం' ఉదాహరణకి - ఒక నాయకుడు ప్రియురాలిని బ్రతిమాలుతూ- "ముఞ్చ-మానం దినం ప్రాప్తమ్" - "కోపం విడిచిపెట్టు, తెల్లవారిపోతూంది" అని అంటాడు. ఆమె ఆ వాక్యాన్ని - "ముఞ్చమానం - దినం - ప్రాప్తమ్" అని కాకుండా "ముఞ్చ - మా - నందినం - ప్రాప్తమ్" అన్నట్లు విడగొట్టి, "వచ్చిన నందిని విడిచిపెట్టకు" అనే అర్థం తీసుకొని "మున్న నన్దీ హరాన్తికే " "మూఢుడా! నంది ఇక్కడ ఎక్కడుంది? ఈశ్వరుడి దగ్గర ఉంది" అని సమాధానం చెపుతుంది

హామ్లెట్ (Hamlet) అనే షేక్స్పియర్ డ్రామాలో రాజకుమారుడైన హామ్లెట్ ఏదో ఆవేశంలో పాలోనియస్ అనే రాజామాత్యుణ్ణి చంపి పారేస్తాడు ఈ విషయం రాజుకు తెలుస్తుంది హామ్లెట్‌ను పిలిపించి "పాలోనియస్ ఎక్కడ?" అని

అడుగుతాడు "At supper" - "భోజనం దగ్గర ఉన్నాడు" అని అతడు సమాధానం చెపుతాడు అప్పుడు రాజు - "At supper! Where?" "భోజనం దగ్గరనా? ఎక్కడది?" అని అడుగుతాడు. అప్పుడు హామ్లెట్ "Not where he eats, but where he is eaten; a certain convocation of politic worms are even at him" (అతడు ఎక్కడ తింటున్నాడో అక్కడ కాదు, అతడు ఎక్కడ తినబడుతున్నాడో అక్కడ ఆతనిశరీరం చుట్టూ తినడానికి గుంపులుగుంపులుగా పురుగులు చేరాయి) అంటాడు ఇలాంటివన్నీ వక్రోక్త్యలంకారానికి ఉదాహరణలు. ఇవి మన భారతీయవాఙ్మయాలలోనే కాదు, షేక్స్పియర్ మొదలైన వాళ్ల రచనల్లో కూడా చాలా కనబడతాయి.

అయితే ఈ వక్రోక్తిని ఒక అలంకారంగానే కాక "సొగసైన పలుకు" అనే అర్థంలో దాని పరిధిని విస్తృతం చేసి అన్ని అలంకారాలకీ వక్రోక్తి మూలం అని అతిప్రాచీనకాలంలో భామహుడే అన్నాడు. అంతే కాదు; అలంకారంగా ప్రసిద్ధిలో ఉన్న 'అతిశయోక్తి' అనే మరొక అలంకారం పరిధిని కూడా విస్తృతం చేసి 'వక్రోక్తి', 'అతిశయోక్తి' రెండూ ఒకటే అని అన్నాడు. అంటే మామూలుగా లోకంలో మాట్లాడే మాటల్లో లేని ఒక వంపు, ఒక సొంపు, ఒక అతిశయం, ఒక విశేషం ఉంటే అది 'వక్రోక్తి' లేదా 'అతిశయోక్తి' అవుతుందని, ఇది సకలాలంకారాలలోను అంతర్లీనంగా ఉంటుందని భామహుని అభిప్రాయం

"ఇత్యేవమాదిరుదితా గుణాతిశయయోగతః,
సర్వైవాతిశయోక్తిస్తు తర్కయేత్తాం యథాగమమ్.

సైషా సర్వైవ వక్రోక్తిరనయార్థో విభావ్యతే,
యత్నోఽస్యాం కవిభిః కార్యః కోఽలంకారోఽనయా వినా. "

(కా అ 2.85, 86)

ఆనందవర్ధనుడు కూడా ఈ విషయాన్ని అంగీకరించాడు (ధ్వన్యాలోకం 3 36)

భామహుడిచ్చిన ఈ సూచనను గ్రహించి పదవశతాబ్దానికి చెందిన కుంతకుడు కావ్యానికి వక్రోక్తియే జీవితం అనే సిద్ధాంతం స్థాపించాడు ఇతరాలంకారికులందరూ పాఠకులకూ, ప్రేక్షకులకూ కలిగే సౌందర్యానుభూతిని దృష్టిలో ఉంచుకొని కావ్యరూపకాదుల విశ్లేషణా, పరిశీలనమూ చేస్తే కుంతకుడు రచయిత దృష్టికోణం నుంచి ఆ పని చేశాడు కావ్యంలో ప్రధానంగా (1) వర్ణవిన్యాసవక్రత (2)

పదపూర్వార్ధవక్రత (3) ప్రత్యయవక్రత (4) వాక్యవక్రత (5) ప్రకరణవక్రత (6) ప్రబంధవక్రత అనే ఆరు వక్రతలు - సొగసైన వంపులు - ఉంటాయి వీటి అన్నింటికీ మూలం 'కవి వ్యాపారవక్రత' ఈ వక్రతలకి ఎన్నో అవాంతరభేదాలున్నాయి వీటిని అన్నింటినీ కుంతకుడు సోదాహరణంగా నిరూపించాడు

1 వర్ణవిన్యాసవక్రత అనగా వర్ణాల కూర్పులోని అందం అనుప్రాస, యమకాది శబ్దాలంకారాలన్నీ ఈ వక్రతలో చేరుతాయి

2 పదపూర్వార్ధవక్రత - ఒక పదంలో ప్రకృతి, ప్రత్యయం, ప్రత్యయాలలో కూడా కృత్ప్రత్యయాలు, తద్ధితప్రత్యయాలు మొదలైనవి ఉంటాయి వాటిలో ప్రకృతివక్రతకు కుంతకుడు 'పదపూర్వార్ధవక్రత' అనీ, రెండవదానికి 'ప్రత్యయవక్రత' అనీ పేర్లు పెట్టాడు. పదపూర్వార్ధవక్రతలో అతడు చెప్పిన కొన్ని ప్రధానాంశాలు ఇవి - ఒకప్పుడు కవి అమూర్తాలను, అనగా ఆకారం లేనివాటిని మూర్తాలుగా వర్ణిస్తాడు ఘనపదార్థాన్ని ద్రవపదార్థంగాను, అచేతనాన్ని చేతనంగాను, చేతనాన్ని అచేతనంగాను వర్ణిస్తాడు ఇది పదపూర్వార్ధవక్రతలో ఒక భేదమైన 'ఉపచారవక్రత' రెండు మూడు ఉదాహరణలు - "నిష్కారణం నికారకణికాపి మనస్వినాం మానసమాయాసయతి" "కారణం లేకుండా వచ్చిన అవమాన కణం కూడా మానవంతుల మనస్సుకు బాధ కలిగిస్తుంది" ఇక్కడ అమూర్తమైన అవమానానికి మూర్తత్వం ఆరోపించి దాని కణం-నలుసు-అని అంటాడు కవి 'హస్తాపచేయం యశః'- 'కీర్తి చేతులతో తెంపుకోవడానికి అనువుగా ఉంది' కీర్తిని పుష్పంవలె మూర్తంగా భావించి దానిని తెంపవచ్చునని వర్ణించాడు కవి "రుద్ధాలోకే నరపతిపథే సూచిభేద్యైస్తమోభిః" - "సూదులతో గుచ్చేటట్లుగా ఉన్న చీకటి రాజమార్గాన్ని ఆవరించింది" ఇక్కడ అమూర్తమైన, ఘనపదార్థం కాని, చీకటిని, ఒక మూర్తద్రవ్యాన్ని గుచ్చినట్లు సూదులతో గుచ్చడానికి వీలున్నట్లు వర్ణించడంలో ఒక సొగసు ఉంది

అచేతనానికి చేతనత్వారోపానికి ఉదాహరణం-

"గగనం చ మత్తమేఘం ధారాలులితార్జునాని చ వనాని,
నిరహఙ్కారమృగాఙ్కా హరన్తి నీలా అపి నిశాః."

"ఆకాశంలో మేఘాలు మత్తెక్కి ఉన్నాయి వనాలలో అర్జునవృక్షాలను జలధారలు కడిగివేశాయి చంద్రుడి అహంకారం తగ్గిపోయి నల్లగా ఉన్నా రాత్రులు మనోహరంగా ఉన్నాయి" ఇక్కడ అచేతనానికి చేతనత్వం ఆరోపించి మేఘాలు

మత్తెక్కి ఉన్నట్లు, చంద్రబింబానికి ఉన్న అహంకారం తొలగిపోయినట్లు వర్ణన చేయబడింది

"శ్వాసోత్కమ్పతరఙ్గిణి స్తనతటే" "దీర్ఘశ్వాసలచేత వక్షస్థలంమీద తరంగాలు లేస్తున్నాయి"- ఇక్కడ ఘనపదార్థాలకి ద్రవత్వం ఆరోపించబడింది ఇలాంటి ఉపచారవక్రతలు వేలకొలది ఉంటా యంటాడు కుంతకుడు

విశేషణవక్రత, సంవృతివక్రత అని పదపూర్వార్ధవక్రతలో మరి రెండు భేదాలు ఉన్నాయి సరియైన విశేషణం ఉపయోగించడంచేత లభించే వక్రత విశేషణవక్రత. ఉదా-

**''కరాన్తరాలీనకపోలభిత్తిర్బాష్పోచ్ఛలత్క్షాణితపత్రలేఖా,**
**శ్రోత్రాన్తరే పిణ్డితచిత్తవృత్తిః శృణోతి గీతధ్వనిమత్ర తన్వీ.''**

"అరచేతులలో చెక్కిళ్లు అణగిపోగా, కన్నీళ్లకు తడిసి పైకి ఉబుకుతూన్న మకరికాది పత్రలేఖలు మునుచుకొనిపోగా, మనస్సంతా చెవుల్లో ముద్దచేసి పెట్టుకొని ఆ తన్వి గీతధ్వని వింటూన్నది" ఇక్కడ ఏ అలంకారాదులూ లేకపోయినా విశేషణవక్రతచేత విరహపీడితురాలైన నాయిక మన కళ్ల ఎదుట కూర్చున్నట్లు వర్ణించబడింది. 'శ్రోత్రాన్తరే పిణ్డితచిత్తవృత్తిః' అనేది అమూర్తానికి మూర్తత్వారోపానికి కూడా ఉదాహరణం.

చెప్పవలసిన విషయాన్ని స్పష్టంగా చెప్పడం కష్టం అన్నట్లు, అనగా అది అనిర్వచనీయం అన్నట్లు సూచించడానికి దాన్ని సంవృతి చేస్తూ, దాన్ని కప్పిపెడుతూ, సర్వనామశబ్దాదులను ఉపయోగిస్తే అది సంవృతివక్రత ఉదా. -

**''తత్పితర్యథ పరిగ్రహలిప్సౌ స వ్యధత్త కరణీయమణీయః,**
**పుష్పచాపశిఖరస్థకపోలో మన్మథః కిమపి యేన నిదధ్యౌ.''**

"తండ్రి (శంతనుడు) సత్యవతిని వివాహమాడాలనే అభిలాష ప్రకటించగానే భీష్ముడు ఒక విన్నపని చేశాడు, దానితో మన్మథుడు పుష్పధనస్సు కొనమీద కపోలం (చెక్కిలి) ఆన్చుకొని ఏమేమో ఆలోచించాడు."

ఇక్కడ ''కిమపి నిదధ్యౌ'' అన్నప్పుడు "ఏమి చేయాలో పాలుపోక ఏమేమో ఆలోచించాడు" అని చెప్పడంలో 'సంవృతివక్రత' ఉన్నది

**3.** ప్రత్యయవక్రత :- ఇది కృత్తద్ధితాదిప్రత్యయాలు, ఆయా సమాసప్రత్తులు, లింగవచనాదులను సూచించే ప్రత్యయాలు- వీటి ప్రయోగానికి సంబంధించినది. ఎక్కువ సంస్కృతకావ్యాలలోను, ఇతరభాషలలో ప్రయోగించే సంస్కృతపదజాలం లోను కనబడుతుంది

**4.** వాక్యవక్రత:- మొత్తం వాక్యాన్ని చదివి అర్థంచేసుకోగానే కలిగిన చమత్కారానికి ఆ వాక్యంలోని వక్రత కారణం కవుల ప్రతిభలు అనంతవిధాలుగా ఉంటాయి కాబట్టి ఈ వాక్యవక్రత కూడా అనంతవిధాలుగా ఉంటుంది అని అంటాడు కుంతకుడు- **"యస్మాత్ కవిప్రతిభానామానన్త్యాత్ నియతత్వం న సంభవతి"** (వ జీ 1 20) ఉపమాద్యలంకారాలన్నీ ఈ వాక్యవక్రతలో అంతర్గతం అవుతాయి

**5.** ప్రకరణ వక్రత:- మాయామృగం వెంట వెళ్లిన రాముడు "హా సీతా! హా లక్ష్మణా!" అని విలపించాడని సీత నమ్మడం కూడా అనుచితమే లక్ష్మణుణ్ణి పంపడం ఇంకా అనుచితం అందుచేత "ఉదాత్తరాఘవం" అనే నాటకంలో మాయామృగం కోసం లక్ష్మణుడే వెళ్లినట్లు, అతని అరపు అనుకొని సీత రాముణ్ణి పంపినట్లు కవి మార్చాడు దీన్ని ప్రకరణవక్రతకు ఉదాహరణంగా కుంతకుడు చూపాడు ఇదే విధంగా రఘువంశం పంచమ సర్గలోని కౌత్సవృత్తాంతం, నవమసర్గలోని దశరథుని మృగయావృత్తాంతం మొదలైనవి ఈ ప్రకరణవక్రతకు ఉదాహరణలుగా ప్రతిపాదించాడు

**6.** ప్రబంధవక్రత:- ప్రబంధంలోని (అది కావ్యం కావచ్చు, రూపకం కావచ్చు) ఇతివృత్తాన్ని చక్కగా నడపడం 'ప్రబంధవక్రత' కుంతకుడు దీనికి కొన్ని నాటకాదులు ఉదాహరణంగా చూపాడు ప్రకరణ-ప్రబంధవక్రతలు మహాకావ్యాలకీ, రూపకాలకీ సంబంధించి ఉండడంచేత నేటి చిన్నకవితలలో వాటి సమన్వయం కుదరకపోయినా కథావస్తువును చమత్కారంగా నడపవలసిఉన్న కథలు, నవలలు మొదలైన వాటిలో వీటిని సమన్వయించుకోవచ్చు

**రససంప్రదాయం:-** రసాన్నిగూర్చి విస్తృతమైన చర్చ ప్రప్రథమంగా నాట్యశాస్త్రంలో కనబడుతుంది నాట్యం అనగా రూపకం నాట్యశాస్త్రం దశవిధరూపకాల లక్షణాలు, వాటి ప్రయోగానికి సంబంధించిన అనేకమైన

ఇతరవిషయాలు ప్రతిపాదిస్తుంది అలాంటి అనేక విషయాలలో ఒకటి రసం ఈ రససిద్ధాంతాన్ని కూడా భరతుడు తనకు ముందు ఉన్నవారినుండి గ్రహించి ప్రతిపాదించినట్లు సూచిస్తాడు **"విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః"** అనేది భరతుడు చెప్పిన రససూత్రం. దీనికి కొంత వివరణ ఆయనే ఇచ్చాడు. ఈ సూత్రానికి వేరు వేరు వ్యాఖ్యాతలు వేరు వేరుగా అర్థం చెప్పినట్లు అభినవగుప్తుడు రచించిన అభినవభారతి అనే నాట్యశాస్త్రవ్యాఖ్యానాన్ని పట్టి తెలుస్తూన్నది ఆ ప్రాచీన వ్యాఖ్యానా లేవీ మనకిప్పుడు లభ్యం అవడం లేదు ఈ సూత్రంలో ఉన్న 'సంయోగాత్,' 'నిష్పత్తిః' అనే పదాల అర్థాన్ని కూర్చే విప్రతిపత్తి అంతా. 'రసం పుట్టుతుంది' అని కొందరూ, 'అనుమితం అవుతుంది' అని కొందరూ, 'భావితం అవుతుంది' అని మరికొందరూ చెపితే ఆ అర్థాలేవీ కాదని 'వ్యంజింపబడుతుంది' అని అభినవగుప్తుడు ప్రతిపాదించాడు "విభావానుభావవ్యభిచారిభావాలతో స్థాయిభావం రసంగా అభివ్యక్తం అవుతుంది" అని అభినవగుప్తుడు చివరికి తేల్చి చెప్పిన అర్థం

అభినవగుప్తుడు ప్రతిపాదించిన రససిద్ధాంతం ఇది - ప్రతిమానవుడిలోనూ కొన్ని భావాలు స్థిరంగా ఉంటాయి అయితే అవి అంతర్లీనంగా ఉంటాయి తగిన పరిస్థితులు ఏర్పడినప్పుడు అవి ఉద్బుద్ధం అవుతాయి- పైకి వస్తాయి వీటిని స్థాయిభావాలు అంటారు. రతి, హాసం, శోకం, క్రోధం, ఉత్సాహం, భయం, జుగుప్స, విస్మయం, శమం అనే తొమ్మిది స్థాయిభావాలు సాధారణంగా ప్రతీవానిలోనూ పుట్టుకతోనే ఉంటాయని అభినవగుప్తుడు అంటాడు -

**"స్థాయిత్వం చైతావతా మేవ, జాత ఏవ హి జన్తుః ఇయతీభిః సంవిద్భిః పరీతో భవతి. ... ... సర్వో హి రిరంసయా వ్యాప్తః, స్వాత్మన్యుత్కర్షమానితయా పరముపహసన్, అభీష్టవియోగసంతప్తః. తద్ధేతుకోపపరవశః అశక్తా తతో భీరుః, కించిదార్జిజీషురపి, అనుచితవస్తువిషయవైముఖ్యాత్మకతయాక్రాన్తః కించిదుభీష్టతయా మన్యమానః, తత్తత్స్వపరకర్తవ్యదర్శనసముదితవిస్మయః, కించ్చి జిహాసురేవ జాయతే"** (అ భా 4)

ఈ తొమ్మిది భావాలే స్థాయిభావాలు పుట్టిననాటినుండి ఈ భావాలు మానవునిలో చోటుచేసుకొని ఉంటాయి ప్రతీవాడూ రమించాలని, ఆనందంగా ఉండాలని కోరుకుంటాడు(రతి) తనలో ఏదో ఆధిక్యం ఉన్నదనే అభిమానంతో ఇతరుల్ని పరిహసిస్తాడు (హాసం) ఇష్టులకి కాని, ఇష్టవస్తువులకి కాని దూరం అయితే

బాధపడతాడు (శోకం) తాను అలా దూరం అవడానికి కారణం అయినవాళ్ల మీద కోపిస్తాడు (క్రోధం) వాళ్లని ఏమీ చేయలేకపోతే భయపడతాడు (భయం) ఏమేమో సాధించాలని అనుకుంటాడు(ఉత్సాహం) కొన్ని వస్తువుల్ని చూచి అసహ్యించు కుంటాడు, వైముఖ్యం చూపిస్తాడు (జుగుప్స) తాను సాధించిన పనులు లేదా ఇతరులు చేసిన కొన్ని పనులు చూచి ఆశ్చర్యపడతాడు (విస్మయం) కొన్నింటిని విడిచి వేయాలని అనుకుంటాడు (నిర్వేదం లేదా శమం) ఇతరభావా లన్నింటికంటె ఇవి ప్రధానం అవడంచేతా, రసాభివ్యక్తి అయేవరకూ ఇవి మాటిమాటికీ ఉద్బుద్ధం అవుతూ ఉండడంచేతా ఇవి స్థాయిభావాలని ఆలంకారికులందరూ అంగీకరించారు

విభావాదిశబ్దాలు పారిభాషికశబ్దాలు కారణాలకి విభావాలనీ, కార్యాలకి అనుభావాలనీ, సహకారికారణాలకు (auxiliary causes) వ్యభిచారిభావాలు లేదా సంచారిభావాలు అనీ పేర్లు ఉదాహరణద్వారా ఈ విషయం స్పష్టం అవుతుంది. రససూత్రాన్ని విశదీకరించేటప్పుడు ఏ రసాన్నైనా ఉదాహరణంగా చూపవచ్చును కాని సాధారణంగా శృంగారరసాన్ని ఉదాహరణంగా చూపడం ఆలంకారికులకు అలవాటు ఇది సర్వజనాస్వాదయోగ్యం అయి ఉండడంచేత అన్ని రసాలలోకీ ప్రధానరసంగా పరిగణింపబడుతుంది దీనికి శృంగారం అనే పేరు రావడానికి కూడా ఇదే కదా కారణం? "శృఙ్గమ్ ఇయర్తి ఇతి శృఙ్గారః" "ప్రాధాన్యాన్ని పొందినది కాబట్టి శృంగారం" అని దీని వ్యుత్పత్త్యర్థం. 'ఆలంబనవిభావం' 'ఉద్దీపనవిభావం' అని విభావం రెండు విధాలు స్త్రీకి పురుషుని మీద కలిగిన రతికి (ప్రేమకు) పురుషుడు ఆలంబనవిభావం. పురుషునికి స్త్రీమీద కలిగిన రతికి స్త్రీ ఆలంబనవిభావం ఇది ప్రధానకారణం ఉద్యానం, వెన్నెల, ఏకాంతప్రదేశం మొదలైనవి ఈ రతికి ఉపోద్బలకాలుగా ఉంటాయి. అందుచేత అవి ఉద్దీపనవిభావాలు. అవి కూడా కొంతవరకు రతికి కారణాలే ఈ రతి ఉదయించగానే కటాక్షవీక్షణాది చేష్టలు ప్రారంభం అవుతాయి లజ్జ, మోహం, హర్షం, ఆవేగం, ఔత్సుక్యం మొదలైన భావాలు ఆ స్థాయిభావం సంచరించేటట్లు, అవిచ్ఛిన్నంగా మెదులుతూండేటట్లు చేస్తాయి అందుచేత వీటికి 'సంచారిభావాలు' అనీ, స్థాయిభావం మనస్సులో అంతటా వ్యాపించేటట్లు చేస్తాయి కాబట్టి వ్యభిచారిభావాలనీ పేరు ఇవి కూడా కారణాలే కాని విభావాదులంటూ ఉంటే వాటి తరవాత వచ్చి సహకరిస్తాయి కాబట్టి సహకారికారణాలు వీటిని అన్నింటినీ ఒక పద్ధతి ప్రకారం నాట్యంలో కాని,

శ్రవ్యకావ్యంలో కాని ఒకచోట కూరుస్తే ప్రేక్షకుని లేదా పాఠకుని మనస్సులో ఉన్న 'రతి' రూపస్థాయిభావం ఉత్తేజితం అవుతుంది, రసంగా మారుతుంది ప్రేక్షకాదుల మనస్సులలో ఈ రత్యాదివాసన లేకపోతే ఇవన్నీ ఉన్నా రసనిష్పత్తి కానే కాదు అందుచేతనే విశ్వనాథుడు- "రూపకప్రదర్శనం చేసే నాట్యగృహంలో గోడలు, స్తంభాలు, రాళ్లు మొదలైనవి ఎంతో రత్యాది వాసనలేని ప్రేక్షకులు కూడా అంతే' అన్న ధర్మదత్తుని శ్లోకం ఉదాహరిస్తాడు -

**"సవాసనానాం సభ్యానాం రసస్యాస్వాదనం భవేత్,**
**నిర్వాసనాస్తు రఙ్గాన్తః కాష్ఠకుడ్యాశ్మసంనిభాః"** (సా ద.3 8)

ఈ విషయాన్నే చమత్కారంగా చెప్పే ఒక శ్లోకాన్ని రాజశేఖరుడు కావ్యమీమాంసలో ఉదాహరించాడు-

**"యేషాం వల్లభయా సమం క్షణమివ స్ఫారా క్షపా క్షీయతే**
**తేషాం శీతకరః శశీ విరహిణాముల్కేవ సంతాపకృత్,**
**అస్మాకం న తు వల్లభా న విరహస్తేనోభయభ్రంశినా**
**మిన్దూరాజతి దర్పణాకృతిరయం నోష్ణో న వా శీతలః"** .(కా మీ 9 23)

అలాభే వైరాగ్యంచేతనో, స్వతఃసిద్ధమైన వైరాగ్యంచేతనో ఇలాంటి భావాలన్నీ అణచిపెట్టుకొన్న ఒక వ్యక్తి అంటూన్న మాటలివి- "ప్రియురాలితో కలిసి అతిదీర్ఘమైన రాత్రిని కూడా క్షణంలాగ గడిపే వాళ్లకి చంద్రుడు చల్లగా కనబడవచ్చు విరహంతో బాధపడే వాళ్లకి ఆ చంద్రుడే కొరవి వలె తాపం కలిగించవచ్చు ఇంక మా సంగతా! మాకు ప్రియురాలూ లేదు; విరహమూ లేదు ఉభయభ్రష్టులమైన మాకు ఈ చంద్రబింబం ఒక అద్దం ముక్కలాగ కనబడుతూన్నది వేడీ లేదు; చల్లదనమూ లేదు "

అందుచేత సానుభూతి గల, భావార్ద్రచిత్తుడైన సహృదయుడే రసాస్వాదం చేయగలుగుతాడు అలాంటి వాళ్లలో కూడా రుచిభేదాన్ని పట్టి కొందరికి కొన్ని రసాలు రుచిస్తే మరికొందరికి మరికొన్ని రుచిస్తాయి. పై శ్లోకంలో చెప్పిన వ్యక్తికే భక్తిభావ శాంతరసాదులచేత హృదయం ద్రవించవచ్చు

భరతుడు ప్రతిపాదించిన రసం కేవలం రూపకాలకి సంబంధించినది శ్రవ్యకావ్యాలకి సంబంధించినది కాదు వాటిలో రసాన్ని చూడడం కాలాంతరంలో

జరిగింది జాగర్తగా పరిశీలిస్తే నిజమైన రసపరిపోషణం రూపకాలలోనే సాధ్యం అవుతుంది సుదీర్ఘఘట్టాలు ప్రవేశపెడితే తప్ప శ్రవ్యకావ్యాలలో పూర్తిగా రసాన్ని పోషించడం చాలా కష్టమైన పని

విభావానుభావవ్యభిచారభావాల సంయోగం వల్ల నిష్పన్నం అవుతుందని చెప్పే ఈ రసం ఎవరిలో నిష్పన్నం అవుతుంది అనేది ప్రశ్న మూలపాత్రలైన దుష్యంత శకుంతలాదులు రసానికి ఆశ్రయం అని కొందరూ, వాళ్ళవేషం ధరించిన నటులు ఆశ్రయమని మరికొందరు అన్నారు "దేవదత్తుడు, అంటే 'x' భోజనం చేస్తే యజ్ఞదత్తుడికి, 'y' కి, తృప్తి ఎలా కలుగుతుంది? మూలపాత్రలలో కాని, నటాదులలోకాని రసం ఉన్నదంటే సామాజికుడికి ఆనందం ఎలా కలుగుతుంది? అందుచేత రసానికి ఆశ్రయం సామాజికుడే నాట్యరంగంమీద ప్రదర్శించిన విభావాదుల్ని చూడగానే సహృదయుడు అవి కథలోని వ్యక్తులకు సంబంధించినవనే విషయం మర్చిపోతాడు (అభినవగుప్తునికి పూర్వుడైన భట్టనాయకుడు చెప్పిన సాధారణీకరణం ఇదే) తనను తానే మరచిపోతాడు దీనికంతకీ కారణం అతడు సహృదయుడు అవడమే. ఆ సమయంలో అతనిలో అంతర్నిలీనంగా ఉన్న రతిశోకాదులు ఉద్బుద్ధం అవుతాయి వాటి అనుభవమే అప్పుడు ఆతనికి ఉంటుంది ఇతర విషయజ్ఞానం ఏదీ ఉండదు ఈ విధంగా నిగళితవేద్యాంతరమైన రత్యాద్యనుభవమే రసం రసం వేరు-దాన్ని ఆస్వాదించడం వేరు కాదు రసం అనేది పటికబెల్లం ముక్కవంటిది కాదు అందుచేత రసాన్ని ఆస్వాదించే ప్రసక్తి లేదు ఆస్వాదనమే రసం 'రసం ఆస్వాదిస్తున్నాడు; ఈ కావ్యంలో ఈ రసం ఉంది' ఇత్యాది ప్రయోగాలన్నీ ఔపచారికప్రయోగాలే రత్యాస్వాదం అయితే శృంగారం అవుతుంది శోకాదుల ఆస్వాదం అయితే కరుణరసాదు లవుతాయి" అని అభినవగుప్తుడు ప్రతిపాదించాడు

ఇక్కడ ఒక ప్రశ్న ఉదయిస్తుంది ఆనందవర్ధనుడు స్థాపించిన ధ్వనిసిద్ధాంతానికి బాగా బలం చేకూర్చిన ఆచార్యుడు అభినవగుప్తుడు ఆనందవర్ధనుడు వస్తుధ్వని, అలంకారధ్వని, రసధ్వని అని మూడు ధ్వనులు అంగీకరించాడు మనం వెనక చూచిన ఉదాహరణలలో గమనించినట్లు ఒక వాక్యం వినగానే దాని వాచ్యార్థం తెలిసిన తరవాత మరొక విషయం కాని, అలంకారం కాని స్ఫురించినప్పుడు "ఈ కవి లేదా కవి సృష్టించిన పాత్ర ఈ వాక్యం ద్వారా ఈ రెండవ వస్తువును (విషయాన్ని) లేదా

అలంకారాన్ని సూచించాడు కదా " అని గ్రహిస్తాం. ఆ విధంగా తెలివిగా చెప్పినందుకు ఆనందిస్తాం అదే విధంగా రసధ్వని లేదా భావధ్వని " అన్నప్పుడు కవి ఈ భావాదులను ప్రస్తావించడం ద్వారా ఈ పాత్రలో ఈ రసం లేదా ఈ భావం ఉన్నట్లుగా సూచిస్తున్నాడు" అని మాత్రమే మనం అనుకోవాలి. ఆనందవర్ధనుడు చెప్పిన దానిని పట్టి ఇంతకు మించి కల్పించడానికి అవకాశం లేదు. అయితే అభినవగుప్తుడు - "ఆ విభావాదులవల్ల సామాజికుని రత్యాదులు ఉత్తేజితము లవుతాయి, అదే రసం" అని ప్రతిపాదించాడు. అందుచేత ఆనందవర్ధనుడు అనుకొన్న రసధ్వని వేరు, అభినవగుప్తుడు చెప్పిన రసధ్వని వేరు అని చెప్పాలి ఈ రెండింటికీ స్పష్టమైన సమన్వయం మనకుఆనందవర్ధనుడిలోగాని,అభినవగుప్తుడిలో గాని కనబడదు దీనికి తగిన సమాధానం ప్రతాపరుద్రీయకర్తయైన విద్యానాథుడు, తద్వ్యాఖ్యాత కుమారస్వామీ సూచించారు.

విద్యానాధుడు లౌకికరసం, అలౌకికరసం అని రెండు రసాలు అంగీకరించాడు విభావాదులు చూడగానే సామాజికుడు "దుష్యంతునికి శకుంతలావిషయకశృంగారం ఉన్నది" అని గ్రహిస్తాడు ఇది లౌకికరసం సామాజికుడు ఈ లౌకికరసాన్ని గుర్తించడంతో ఆగిపోడు ఇతడు సెన్సార్ బోర్డు మెంబరో, రెవ్యూ వ్రాసే విమర్శకుడో కాదు, మంచి సహృదయుడు అందుచేత ఇతనిలో నిద్రాణమైన భావాలు ఉత్తేజితా లవుతాయి అప్పుడు ఇతడు ఇతరవిషయాలన్నీ మరచిపోయి తన్మయత్వంతో రత్యాద్యనుభూతిలో ఉండిపోతాడు ఆ అనుభూతియే అలౌకికరసం మనం ఈ విషయాన్ని గూర్చి వ్రాయడానికీ, వినడానికీ ఇంత సమయం పట్టింది కాని విభావాది సాక్షాత్కారమూ, లౌకికరసజ్ఞానమూ, అలౌకికరసాస్వాదమూ- ఇవన్నీ ఒక్క తృటిలో జరిగిపోతాయి అందుచేత "అభినవగుప్తుడు మొదటి మెట్టైన లౌకికరసజ్ఞానాన్ని (ఆనందవర్ధనుని రసం ఇదే) మండూకప్లుతితో దాటేసి రెండవమెట్టు మీదికి వెళ్ళాడు" అని సమాధానం చెప్పుకోవాలి

రత్యాది స్థాయిభావాలు తొమ్మిదీ బాగా పరిపుష్టి చెందినప్పుడే రసస్థితిని పొందుతాయి పరిపుష్టాలు కానప్పుడు, ఉత్తేజనం పొందనప్పుడు వాటిని భావాలుగాను, వాటి ధ్వనిని భావధ్వనిగాను పరిగణిస్తారు ఇవి కాక నిర్వేదం, హర్షం, వ్రీడ(లజ్జ) మొదలైన ముప్పై మూడు భావాలు ఉన్నాయి వీటిని ఏదైనా ఒక

స్థాయిభావానికి అంగాలుగా, అనగా రత్యాదిస్థాయిభావవ్యంజకాలుగా ఉపయోగించినప్పుడు అవి వ్యభిచారిభావాలు అవుతాయి వీటినే స్వతంత్రంగా వ్యంజింపచేసినప్పుడు భావధ్వని అవుతుంది మానవులలో ఎన్ని భావాలు ఉండడానికి అవకాశం ఉందో వాటి నన్నింటినీ ఈ నలభైరెండు భావాలలో అంతర్గతం చేయవచ్చు చేయడానికి శక్యం కాని భావం ఏదైనా ఉంటే దానిని స్వతంత్రభావంగా అంగీకరించడంలో ఏ ఆలంకారికుడికీ అభ్యంతరం ఉండదు

ఇప్పుడు భావరసధ్వనులకు రెండుమూడు ఉదాహరణలు చూద్దాం -

**"ఏవంవాదిని దేవర్షౌ పార్శ్వే పితురధోముఖీ,**
**లీలాకమలపత్రాణి గణయామాస పార్వతీ"** (కుమా 6 84)

సప్తర్షులు తన తండ్రి దగ్గరికి వచ్చి ఈశ్వరునితో తన వివాహాన్ని గూర్చి ముచ్చటిస్తూన్నప్పుడు, పార్వతి తండ్రి ప్రక్కనే కూర్చొని, తల వంచుకొని చేతిలో ఉన్న పద్మం రేకులు లెక్కపెడుతూన్నదట ఇక్కడ వ్రీడ (లజ్జ) అనే భావం వ్యంజితం అవుతూన్నది భావధ్వని

రసానికి ఉదాహరణ. -

**"శూన్యం వాసగృహం విలోక్య శయనాదుత్థాయ కించిచ్ఛనై**
**ర్నిద్రావ్యాజముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖమ్,**
**విస్రబ్ధం పరిచుమ్బ్య జాతపులకామాలోక్య గండస్థలీం**
**లజ్జానమ్రముఖీ ప్రియేణ హసతా బాలా చిరం చుమ్బితా."** (అమరుకం)

నాయిక నవోఢ, ముగ్ధ శయనగృహంలో భర్త నిద్రిస్తున్నట్లు అభినయిస్తూ పండుకొని ఉన్నాడు. అక్కడ ఇంక ఎవ్వరూ లేరు ఆమె మెల్లగా శయనం నుంచి లేచింది భర్తముఖంవైపు తదేకదృష్టితో చాలాసేపు చూచింది నిర్భయంగా ఒక్క ముద్దు పెట్టుకుంది అతని గండస్థలంమీద గగుర్పాటు చూచి సిగ్గుతో తలవంచుకుంది అప్పుడు భర్త లేచి ఆమెను చాలసేపు చుంబించాడు ఇది శృంగారానికి ఉదాహరణం ఒక్క శ్లోకంలో చెప్పడంచేత శృంగారానుభూతి పూర్తిగా ఉన్నట్లు కనబడక పోవచ్చును కాని సహృదయుడు భావనాప్రపంచంలోనికి పోయి ఆస్వాదించాలి నిజానికి ఈ సంఘటనే దృశ్యరూపంలో రంగస్థలంమీద (టీ వీ లో) ఐదారు నిమిషాలు చూపిస్తే పరిపూర్ణ రతిపరిపుష్టి కలుగుతుంది,

శృంగారత్వం నిఃసంశయంగా లభిస్తుంది

మరొక ఉదాహరణం -

**"యథోర్ధ్వాక్షః పిబత్యమ్బుః పథికో విరళాఙ్గుళిః,**
**తథా ప్రపాపాలికాపి ధారాం వితనుతే తనుమ్."**

పూర్వం బాటసార్ల కోసం చలివెందలలు ఏర్పాటు చేసేవారు రెండు మూడు అడుగులు ఎత్తుగా ఉన్న తిన్నెమీద నిలబడి ఒక యువతి నీళ్ళ దోసిట్లో పోస్తూంటే పాంథుడు త్రాగాలి ఇదీ పద్ధతి ఒక బాటసారి దోసిలిపట్టి చూపులు మాత్రం పైకి ప్రసరింపచేస్తూ, చేతుల వ్రేళ్ళు ఎడంచేస్తూ నీళ్ళు త్రాగుతున్నాడు. అతడు అలా త్రాగుతున్న కొలదీ ఆ యువతి జలధార సన్నం చేస్తూన్నది ఇక్కడ రతి ఉన్నదిగాని రసస్థితికి పరిపుష్టం కాలేదు అందుచేత ఇది రతిభావధ్వనికి ఉదాహరణం. పైన చూపిన ఏ ఉదాహరణలోనూ కూడా ధ్వనింపచేసే రసభావాలను వాచ్యం చేయలేదు. విభావాదులద్వారా వ్యంజింపచేయడమే జరిగింది. "నేను నిన్ను ప్రేమిస్తున్నాను", "నాకు చాలాకోపం వచ్చింది" ఇత్యాదిరీతులలో రత్యాదుల్ని వాచ్యం చేస్తే రసప్రతీతి కలగదనీ, అది 'వమనం' అనే రసదోషం అనీ ఆలంకారిక సిద్ధాంతం

రససిద్ధాంతాన్ని కూర్చి, కొన్ని అపోహలు ఉన్నాయి దీనిని గూర్చి మాటలాడే వారు ఇదేదో సామాన్యులకు అర్థంకాని నిగూఢరహస్యం అన్నట్లు మాటలాడు తుంటారు అది విని - "నిజమే కాబోలు, మన సాహిత్యానికీ రసానికీ సంబంధం లేదు" అని కొందరు రచయితలు కూడా అనుకొంటూ ఉంటారు అలా అనుకొనేవాళ్ల రచనల్లోనే రసభావాదిధ్వనులకు ఉదాహరణలు కోకొల్లలుగా చూపవచ్చు రసం విషయంలో నాలుగైదు ప్రాచీనవాదాలు ఉన్నాయి వాటిలో ఏమాత్రమూ అస్పష్టత లేదు ఒక దానిలో ఏవైనా లోపాలు ఉంటే మరొకరు మరొక పద్ధతి సూచించడం జరిగింది ఇవన్నీ కలిస్తే ఐదారు పేజీలు మించవు 'రసానుభూతి అలౌకికం' అని ఎక్కడైనా ప్రాచీనులు వ్రాసినా దానికి అర్థం లోకంతో సంబంధంలేనిది అని కాదు పదిమంది కలిసి వీధిలో కొట్లాడుకుంటూన్నప్పుడు చూచినా, ఆ కొట్లాటలో పాల్గొన్నా కలిగే అనుభూతి వీరరసం కాదు, అది లౌకికానుభూతి ఆ కొట్లాటనే రూపకాదులలో వర్ణించినప్పుడు దాని వలన కలిగే అనుభూతి వీరరసానుభూతి అవుతుంది ఈ విధంగా కావ్యాదుల ద్వారా కలగడం వల్ల దానిని అలౌకికం అన్నారు రససిద్ధాంతాన్ని ప్రతిపాదించిన భరతుడే "బెల్లం, ఏలకులు,

మిరియాలు మొదలైనవి కలిపి తయారు చేసిన పదార్థంలో క్రొత్తరుచి వచ్చినట్లు విభావాదుల కలయికవల్ల రసనిష్పత్తి కలుగుతుంది" అని చెప్పి లౌకికోదాహరణలద్వారా దీని లౌకికత్వాన్ని అంగీకరించాడు ఇంక కొందరు ప్రాచీనాలంకారికులు కొన్ని తాత్త్వికాంశాలను రసానుభూతి సందర్భంలో చర్చిస్తే, అది తిన్న ఆహారం ఎలా జీర్ణం అవుతుందో చెప్పడానికి వైద్యుడు జీర్ణావయవమండలం చేసే పనిని అంతా వర్ణించడం వంటిదే ఈ చర్చను అన్ని అనుభూతుల విషయంలోనూ సమన్వయం చేసుకోవచ్చు కొందరు ఆధునిక విమర్శకులు ఏమి వ్రాస్తున్నారో తమకు గాని, చదివేవాళ్లకిగాని తెలియకుండా పేజీలకు పేజీలు వ్రాసి అనేకభాషలలో ప్రింటు చేయిస్తున్నారు దానితో వచ్చింది రససిద్ధాంతాన్ని గూర్చిన భ్రమ అంతా

ఏదైనా ఒక సన్నివేశాన్ని-అది ప్రేమసన్నివేశం కావచ్చు, కరుణ సన్నివేశం కావచ్చు, వీరత్వప్రదర్శన సన్నివేశం కావచ్చు, హాస్యసన్నివేశం కావచ్చు- చక్కగా నిర్వహిస్తే, నాటకం లేదా సినిమా అయితే అది చూస్తున్నంతసేపూ, శ్రవ్యకావ్యం అయితే అది చదువుతున్నంతసేపూ ప్రేక్షకుడు లేదా పాఠకుడు తనను తాను మరచి, చూస్తున్న దానితో, చదువుతూన్నదానితో తన్మయత్వం చెందుతాడు. ఆ తన్మయత్వమే రసం అట్టి స్థితి ఒక మెరుపు లాగ వస్తే అది భావానుభూతి. ఈ దృష్టితో అర్థం చేసుకుంటే రససిద్ధాంతం ఎంత సదాతనమో (సార్వకాలికమో) తెలుస్తుంది

మనం వెనక చూచినట్లు ఈ రససిద్ధాంతాన్ని దృశ్యకావ్యాలను దృష్టిలో పెట్టుకొని ప్రతిపాదించడం జరిగింది శ్రవ్యకావ్యం దీనిని నడిపించడం అంతగా సాధ్యంకాదని ప్రాచీనులు కూడా అభిప్రాయపడ్డారు. అందుచేతనే శ్రవ్యకావ్యాలలో రసస్ఫూర్తి ఎక్కడైనా ఉన్నా అది అలంకారం కోవకో, గుణంకోవకో చెందుతుందని భామహ-దండి-వామనాదులు అభిప్రాయపడ్డారు ఆనందవర్ధనాదులు ధ్వనిసిద్ధాంతాన్ని స్థాపించి శ్రవ్యకావ్యాలలో కూడా రసానికి స్వతంత్రస్థానం ఉన్నట్లు ప్రతిపాదించారు

**ఔచిత్యసంప్రదాయం :-** అలంకారశాస్త్రసంప్రదాయాలన్నీ కూడా ఔచిత్యానికి ప్రాధాన్యం అంగీకరిస్తాయి అందుచేత దీన్ని ప్రత్యేకసంప్రదాయంగా చెప్పవలసిన పనిలేదు క్షేమేంద్రుడు (12వ శతాబ్దం) "ఔచిత్యవిచారచర్చ" అనే

గ్రంధం వ్రాశాడు కదా అని దీన్ని ఒక సంప్రదాయంగా కొందరు అనడం ఉంది ఔచిత్యానికి ఉన్న ప్రాధాన్యాన్ని ఆనందవర్ధనుడే స్పష్టీకరించాడు-

"అనౌచిత్యాదృతే నాన్యద్రసభఙ్గస్య కారణమ్,
ప్రసిద్ధౌచిత్యబన్ధస్తు రసస్యోపనిషత్ పరా "(ధ్వన్యాలోకం 3 14)

"రసభంగానికి అనౌచిత్యాన్ని మించిన మరొక కారణం ఏదీ లేదు ఔచిత్యాన్ని పాటించడం రసానికి సంబంధించిన గొప్ప ఉపనిషత్తు (రహస్యం) "

"ఒక రసాన్ని నడిపిస్తూన్నప్పుడు విరోధిరసాన్ని తీసికొని రాకూడదు సామర్థ్యం ఉంది కదా అని అనవసరంగా అలంకారాలు గుప్పించకూడదు కథాగమనం కుంటువడేలాగ దీర్ఘవర్ణనలు చేయకూడదు కేవలం కథాకథనమే ప్రధానంగా పెట్టుకోకూడదు ఆ పనిచేయడానికి ఇతిహాసపురాణాదులున్నాయి" ఔచిత్యానికి సంబంధించిన ఇలాంటి ఎన్నో విషయాలు ఆనందవర్ధనుడు ప్రతిపాదించాడు

ఈ భాగాన్ని ముగించే ముందు అలంకారశాస్త్రానికి సంబంధించిన ఐదారు ప్రధానవిషయాలు చెప్పవలసి ఉంది.

1. కొన్ని గుణ-అలంకారాదుల్ని గూర్చి చెప్పి- "ఈ విషయంలో మేము చెప్పినదే చివరిమాట అని అనుకోనక్కరలేదు. ఎందరో మేధావులు ముందు ముందు రావచ్చు. వాళ్లు ఏవైనా క్రొత్త అలంకారాదులు చెపితే అవీ గ్రాహ్యాలే" అని అంటాడు దండి-

**"కావ్యశోభాకరాన్ ధర్మానలంకారాన్ ప్రచక్షతే,**
**తే చాద్యాపి వికల్ప్యన్తే కస్తాన్ కార్త్స్న్యేన వక్ష్యతి".** (కావ్యాదర్శం 2.1)

"కావ్యానికి శోభ కూర్చేవి అలంకారాలు. ఇప్పటికీ వాటిని గూర్చి కొత్త కొత్త ప్రతిపాదనలు జరుగుతూనే ఉన్నాయి వాటిని పూర్తిగా చెప్పగలవాడు ఎవడు ?"

ఆనందవర్ధన - జగన్నాథాదులు-

"సహస్రశో హి మహాత్మభిరన్యైరలంకారప్రకారాః ప్రకాశితాః, ప్రకాశ్యన్తే చ"
(ధ్వన్యా 1.1)

ఎందరో మహాత్ములు వేలకొలది అలంకారపద్ధతులు చూపించి ఉన్నారు; ఇంకా చూపుతున్నారు "

"గుణత్వాలంకారత్వయోరననుగమాత్ "( రసగంగాధరం పేజి 8)
"ఇవే గుణాలు, ఇవే అలంకారాలు అని కచ్చితంగా చెప్పడం కుదరదు "

**2. కవిసమయాలు :–** కాలక్రమంలో కొన్ని కవిసమయాలు ( కవులు చేసుకొన్న కట్టుబాట్లు) ఏర్పడ్డాయి ముఖాన్ని పద్మంతోనే పోల్చాలి, కలవతో పోల్చకూడదు నవ్వు ,కీర్తి తెల్లగా ఉంటాయి ఇలాంటి కవిసమయాలు ఎన్నో ప్రచారంలో ఉండడంతో 'పద్మం' లేదా 'చంద్రుడు' అనగానే ముఖం అని అర్థం చేసుకోవడం, వాటిని ముఖానికి ప్రతీకగా వాడడం- ఇలాంటి పద్ధతులు కావ్యాలలోనికి వచ్చాయి ఇలాంటివి ఆధునిక సాహిత్యంలో కోకొల్లలుగా వస్తున్నాయి. ( కవి సమయాలను గూర్చిన విస్తృతవర్ణన కావ్యమీమాంసలో 14వ అధ్యాయంలో ఉన్నది)

**3. పారడీ** వంటి ప్రక్రియలు అప్పుడు కూడా ఉన్నాయి. ఉదాహరణకి-

**"అరణ్యే నిర్జనే రాత్రావన్తర్వేశ్మని సాహసే,**
**న్యాసస్యాపహ్నవే చైవ దివ్యా సంభవతి క్రియా."** ( కావ్యమీమాంస 11 23)

అని నారదస్మృతిలోని శ్లోకం నిర్జనారణ్యంలోను, రాత్రి, గృహమధ్యంలోను , బంది పోటు వంటి సాహసకృత్యాలలోను, దాచడానికి ఉంచిన వస్తువు తిరిగి అప్పచెప్పనప్పుడూ అపరాధిని పరీక్షించడానికి దివ్యక్రియ ( కాల్చిన ఇనుపగుండు చేతిలో పెట్టడంవంటి పరీక్ష) సంభవిస్తుంది ( జరపాలి) అని దీని అర్థం దీని మూడవ పాదం మార్చి వ్రాసిన శ్లోకం-

**"అరణ్యే నిర్జనే రాత్రావన్తర్వేశ్మని సాహసే,**
**తన్వఙ్గీ యది లభ్యేత దివ్యా సంభవతి క్రియా"** ( కావ్యమీమాంస 11 24)

"నిర్జనవనంలోను, రాత్రి, నాలుగుగోడల మధ్యా తన్వంగి లభిస్తే దివ్యమైన క్రియ జరుగుతుంది"

4 రసం ఉన్న కావ్యం అన్నింటికంటె మంచిది అని అందరూ అంగీకరించినా రసం ఉంటేనే కావ్యం అవుతుంది అనే వాదాన్ని జగన్నాథపండితరాయలు తీవ్రంగా ఖండించాడు నూటికి ఎనభై కావ్యాలలో రసం చూపడం కష్టం కాని వాటిలో చమత్కారానికి లోపం ఉండదు జలపాతాలు, చిన్నపిల్లల ఆటలు, వానరాదిచేష్టలూ వర్ణించే ఘట్టాలలో రసం ఏముంటుంది? తావన్మాత్రం చేత అవి కావ్యాలు కావంటామా అని ఆయన ప్రశ్నిస్తాడు

5 'కావ్యం' అంటే కొన్ని వందల పద్యాలు ఉన్నది కాని, కొన్ని పుటల గద్యం ఉన్నది కాని కావలసిన పని లేదు చక్కని అర్థం బోధించే ఒక్క వాక్యమైనా కావ్యమే ఇది ఛందోబద్ధం కావచ్చు, గద్యరూపం కావచ్చు ఇది ఆలంకారికసిద్ధాంతం

# 2

అలంకారశాస్త్రానికి సంబంధించిన ఈ విషయాలన్నీ ఆధునికసాహిత్యాలకి ఉపయోగిస్తాయా అని ప్రశ్న రచయిత ఏ కాలానికి చెందినవాడైనా ఆతడు రచనలలో ఉపయోగించేది భాషే అయితే, ఆ భాషను భావావిష్కరణం కోసమే ఉపయోగిస్తే, ఆ భావావిష్కరణం ప్రభావవంతంగా ఉండాలని అతడు ఉద్దేశిస్తే, అలంకారశాస్త్ర సిద్ధాంతాలనీ, విషయాలనీ కూడా ఆధునికసాహిత్యాలకే కాదు భవిష్యత్సాహిత్యాలకి కూడా సమన్వయించవచ్చు. ఈ విషయాన్ని నిరూపించడానికి స్థాలీపులాకన్యాయంగా ఐదారుగురు ఆధునిక ప్రసిద్ధ కవుల రచనలలో నుంచి ఉదాహరణలు చూద్దాం

ముందుగా ఒక్క విషయం చెప్పవలసి ఉంది కవిసమయాలను గూర్చి వెనక చూచి ఉన్నాం కొందరు కవులు అప్పుడప్పుడు కొన్ని ప్రతీకలు కల్పించుకొని తమ రచనలలో చొప్పిస్తూంటారు అవన్నీ ఒక విధంగా రూపకగర్భితాలైన కవిసమయాలే కొంత కాలం క్రితం ఒక నూతనకవితావిధానం ప్రారంభం అయింది హిందీ సాహిత్య విమర్శకులు దానికి 'ఛాయావాదం' అనీ, 'రహస్యవాదం' అనీ పేర్లు పెట్టారు జడ ప్రకృతి మీద మానవధర్మాలు ఆరోపించడం 'ఛాయావాదం' అనీ, పరోక్ష ప్రియుడైన పరమాత్మ విషయంలో జీవుని నిరంతరవిరహార్తిని వర్ణించడం 'రహస్యవాదం' అనీ స్థూలంగా అర్థం చెప్పవచ్చు. అనగా రహస్యవాదం "పరమాత్మ ప్రియుడనీ, ఆతని సమాగమం కోసం పరితపిస్తూన్న జీవుడు ప్రేయసి అనీ" వర్ణించే ఉజ్జ్వలభక్తి లేదా మధురభక్తిమార్గానికి దగ్గరగా ఉంటుంది ఈ రహస్యవాదకవితలు వ్రాసే కవులు రూపకాతిశయోక్త్యలంకారాలనీ, లాక్షణిక పదజలాన్నీ అధికంగా వాడుతూ ఉంటారు. ఉదాహరణకు వారి పరిభాషలో కొన్ని పదాల అర్థాలు ఇలా ఉంటాయి-

1. ప్రియతముడు; అజ్ఞాతుడు = బ్రహ్మ లేదా పరమేశ్వరుడు
2. సాగరం = సంసారం
3 తమస్సు, రాత్రి = అజ్ఞానం, దుఃఖం

4. ప్రకాశం= జ్ఞానం, ఆశ
5. గాయకుడు= సాధకుడు, ఉపాసకుడు
6. వీణ, మురళి = శరీరం, జీవాత్మ, హృదయం
7. ప్రభాతం = ఆనందం, జీవన ప్రారంభం
8. తెప్ప, నావ = శరీరం
9. మలయపవనం = భావావేశం
10. నిదాఘం = వియోగం
11. చంద్రిక = శాంతి
12. సంగీతం, గానం = భావనాధార, అంతర్నాదం
13. నిర్వాణం = మృత్యువు, ముక్తి
14. స్వప్నలోకం = బ్రహ్మలోకం
15. మధువు = ప్రేమ

ఈ పద్ధతిలో ఉంటాయి

రవీంద్రనాధుని రచనలన్నీ, ప్రధానంగా 'గీతాంజలి' మొదలైనవి రూపకాతిశయోక్తి-లక్షణా ప్రధానాలైన ఇలాంటి శబ్దాలలో నడుస్తాయి ఛాయావాద రహస్యవాదకవితలవలె తెలుగులోని భావకవుల కవితలు కూడా రూపక ప్రధానాలుగానే ఉంటాయి.

1 ప్రసిద్ధ హిందీ కవయిత్రి మహాదేవి వర్మ రచనలలోనుండి రెండు ఉదాహరణలు -

అ) ' ' अर्चन रे!

उस ः रे!

अभिनन्दन रे!

(आधुनिक कवि Part - I. P.90)

ఈ గీతంలోని ప్రియుడు భగవంతుడే. తన జీవనం ఆ భగవంతుని సుందర మందిరం దానిలో ఆయనకి జలకణాలతో పాదప్రక్షాళన చేస్తాను ఇతర ఉపచారాలు ఈవిధంగానే చేస్తాను అంటుంది కవయిత్రి ఇది మధురశృంగారానికి ఉదాహరణం కన్నీళ్లే కాళ్లు కడిగే నీళ్లు, మనస్సే దీపం, ఇత్యాదివిధంగా రూపకాలంకారాలలో నడిచింది గీతం

మరొక ఉదాహరణ -

ఆ) अब देखूँ

प्यासे सूखे अधरों को

(आधुनिक कवि Part I P 46)

ఈగీతంలో కవయిత్రి - "చుట్టుప్రక్కల కనబడే దుఃఖజనకాలైన దృశ్యాలు చూడాలా, ఆనందకరాలైన దృశ్యాలు చూడాలా?" అని ప్రశ్నిస్తుంది ఇక్కడ సుందరదృశ్యాలను చూడడం వల్ల కలిగే హర్షానికీ, దుఃఖమయాలైన దృశ్యాలు చూడడంవల్ల కలిగే నిర్వేదానికీ సంధి భావసంధికి ఉదాహరణం పరమేశ్వరుని సృష్టిలో ఉన్న వైచిత్ర్యాన్ని చూడడం వల్ల కలిగే విస్మయం కూడా ప్రధానంగా వ్యంగ్యం అవుతుంది

2. కృష్ణశాస్త్రిగారి కావ్యాలలో నుంచి రెండు మూడు ఉదాహరణలు -

అ) **"ప్రాణసఖుడె నా కోసమై పంపినాడు**
**పల్లకీ అన హృదయమ్ము ఝల్లుమనియె**
**వీడని వియోగమున వేగు మోడు మేను**
**తలిరుతోరణమై సుమదామమాయె**
**కొసరు నడల తూగాడుచు కూరుచుంటి**
**పూలపల్లకిలో పూలమాల నేను"** (పల్లకీ)

ఇక్కడ 'ప్రాణసఖుడు' పరమాత్మ 'నేను' జీవాత్మ 'పల్లకీ' భావనాపరంపర అది ఎక్కి వియోగార్తుడైన జీవుడు పరమాత్మను చేరడానికి ప్రయత్నిస్తున్నాడు ఈ అర్థంలో ఇది మధురభక్తికి ఉదాహరణం. స్థూలంగా కనబడే అర్థాన్ని పట్టి కూడా ప్రియుని విషయంలో ప్రేయసికి గల రతి ధ్వనిస్తూన్నది. "మేను సుమదామం అయింది" - రూపకాలంకారం

ఆ) అది శరద్రాత్రి శీతచంద్రాతపాంత
రాళరమణీయ రజతతల్పంబునందు
... .... ......
మేను మరచిన నన్నంత మేలుకొలిపె
శర్వరీశీతపవన పక్షములనుండి
స్వాదుయమునోర్మి సంగీతఝురుల గలసి
కౌముదీధౌత శుభ్రదిక్తటుల సొలసి
మురళికామందమందమాధురుల రుచులు. (అన్వేషణ)

శరద్రాత్రి, చంద్రాతపం, అందరూ నిద్రపోతూ ఉండడం మొదలైనవి ఉద్దీపనవిభావాలు కృష్ణుడు ఆలంబనవిభావం వెన్నెలే ఒక రజతతల్పం-రూపకం కౌముదికి జలత్వారోపం దిక్కులకు మూర్తత్వారోపం చేసి కడగబడినట్లు చెప్పడం రాధకు కలిగిన శ్రీకృష్ణవిషయకరతి వ్యంగ్యం

ఇ) ఆకులో ఆకునై పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై నునులేత రెమ్మనై
ఈయడవి దాగిపోనా.... (ఆకులో ఆకునై)

ఆకులో ఆకుగా, పువ్వులో పువ్వుగా మారిపోవాలి అని ఉత్కంఠారూపవిభావం ఇది ఔత్సుక్యాంతర్గతం కవిలో ఉన్న ప్రకృతివిషయకరతి గమ్యం అవుతూన్నది భావధ్వని.

రతినే స్త్రీపురుషవిషయకం అయితే అనురాగం అనీ, చిన్న పిల్లల విషయంలో అయితే వాత్సల్యం అనీ, భగవంతుని విషయంలో అయితే భక్తి అనీ, మిత్రుని విషయంలో స్నేహం అనీ, ఇతరవిషయాలలో ప్రేమ అనీ ఆలంకారికులు అంటారు

ఈ) ఈ లోకమ్ము దరిద్రతా కృపణతా హింసా రిరంసా రుషో
ద్వేలోల్లోలములన్ మునింగి విషయాభీలస్థితిన్ మాయునే
మో, లేకున్న సహోదరాస్థిపలలమ్ముల్ తించురే యెందు? త
త్కీలాలాసవ పానలాలస మదాంధీభూతులై మానవుల్.

ఇక్కడ క్రోధభావధ్వనికి అనుగుణంగా దీర్ఘసమాసరూపమైన ఓజోగుణం ఉన్న గౌడరీతిని ఉపయోగించాడు కవి

3. శ్రీశ్రీ కవితలలో నుంచి రెండు మూడు ఉదాహరణలు :-

అ) పురాణాలు పుక్కిలించిన
కిరాణా కవులంతా
నక్సలైట్ నరకాసురు ణ్ణెదిరించి
సినీమాతార సత్యభామ
ధనస్వామ్య దామోదరుణ్ణి రక్షిస్తుందని
అమాయకంగా నమ్ముతారు. ( ఎవరిది హింస).

దీనిలో వృత్త్యనుప్రాసం అనే శబ్దాలంకారం స్పష్టంగా వినబడుతూనే ఉంది "పురాణాలు పుక్కిలించిన" అన్నప్పుడు పురాణాలకు ద్రవత్వారోపణం ఉపచారవక్రతకు ఉదాహరణం. నక్సలైట్‌కు నరకాసురత్వం, సినీమాతారకు సత్యభామాత్వం, ధనస్వామ్యానికి దామోదరత్వం ఆరోపించబడ్డాయి రూపకాలంకారాలు ధనస్వామ్యం అనే అమూర్తానికి మూర్తత్వారోపం - ఉపచారవక్రత. విప్లవవ్యాప్తివిషయంలో ఉత్సాహధ్వని.

ఆ) "ఎక్కడయ్యా నీ అహింస
ఏడ నీ కరుణా రిరంస
చూడు దేశం ద్వేషభగ్నం
క్షురత్ జిహ్వానల విభుగ్నం." ( ఓ! మహాత్మా! ఓ! మహర్షీ!)

ఇక్కడ శబ్దాలంకారప్రయోగం 'క్షురత్ జిహ్వానలవిభుగ్నం' ఇత్యాది సమాసాలతో ఓజోవంతంగా ఉన్న శైలికి సహకరిస్తూ దేశపరిస్థితుల్ని చూడడంచేత కవిలో కలిగిన క్రోధావేశాన్ని ధ్వనింపచేస్తూన్నది

ఇ) "అరెరే దమ్మిడీ" అనే లఘుకావ్యంలో "ఎంత స్వల్పమైనా చేతిలో ఉన్న ధనాన్ని సమసమాజస్థాపనకోసం వెచ్చించాలి" అనే ఉద్బోధ కావ్యగతధ్వని

ఈ) "మెల్లమెల్లగా జోరుజోరుగా" లన్న లఘుకావ్యంలో మెల్లగా ప్రారంభమైన విప్లవం క్రమంగా వేగం పుంజుకుంటూన్న దన్న విషయాన్ని వివిధఉపమాలంకారాల ప్రయోగంద్వారా విశదీకరిస్తాడు కవి "విత్తనంలో నుంచి ఎదుగుతూన్న వృక్షంలాగ" "గర్భంలో ఎదుగుతూన్న పిండంలాగ" మెల్లిగా

బయలుదేరింది విప్లవం "చీకట్లో వేగుచుక్కలాగ' నిరాఘాటంగా బైటకు వచ్చి, "విప్లవకవి గొంతుకలో ఉప్పొంగుతూన్న నినాదాల్లాగ" రవళిస్తూ "తుఫానులో సముద్రతరంగాల్లాగ" లేస్తూ అంతటా వ్యాపిస్తూన్నదని చెపుతూ కవి ఐదు ఉపమానాల సహాయంతో దాని వ్యాప్తిని మన మనోనేత్రాల ముందు ఉంచాడు "పెద్దపెద్ద అంగలు వేస్తూ" అన్నప్పుడు రూపరహితమైన విప్లవానికి రూపకల్పన- ఉపచారవక్రత "నెత్తురు నాలుకలు చాస్తూ" అన్నప్పుడు రూపకాలంకారంతో కూడిన ఉపచారవక్రత

4. ఇప్పుడు నారాయణరెడ్డిగారి రచనలలో నుంచి రెండు మూడు ఉదాహరణలు చూద్దాం -

అ) ఈ ప్రపంచసృష్టి ఎప్పుడు జరిగింది, ఎలా జరిగింది, ఎందుకు జరిగింది, ఎవరివల్ల జరిగింది - ఈ ప్రశ్నలకి సమాధానాలు దొరకడం లేదు వైజ్ఞానికు లనేవాళ్ళ చెప్పిన సమాధానాలైనా, తాత్త్వికులు అనేవాళ్ళ చెప్పే సమాధానాలైనా ఊహాగానాలుగానే కనబడతాయి ఇంక ఈ జగత్తులో ఒక అంశంగా అవతరించిన మనిషి స్వరూపం ఏమిటి, ఎప్పుడు పుట్టాడు, ఎందుకు పుట్టాడు- ఇలాంటి ప్రశ్నలకి కూడా సమాధానాలు లేవు. మనిషి పుట్టినప్పటి నుంచీ ఏవేవో ఘనకార్యాలు సాధిస్తున్నాననీ, సాధించబోతున్నాననీ అనుకుంటూనే కనుమరుగైపోతున్నాడు అడుగడుగునా పశ్చాద్గమనం చేస్తూనే పురోగతి సాధిస్తున్నాని అనుకుంటూ సంతోషిస్తూంటాడు ఏమైనా ఇదంతా ఏనాటికీ వీడని రహస్యం అనే విషయం నారాయణరెడ్డిగారి విశ్వంభర చదువుతే మనకు కలిగే బావం. ఈ బావం ఒక విధమైన విస్మయమే అందుచేత అద్భుతరసం ప్రబంధ ధ్వని అని చెప్పవచ్చు సరియైన సమాధానాలు లేకుండా వదిలేసిన-

"ఎవరు చేసిన సృష్టి ఇది? చివరికి మృత్యువే సత్యమా?
... ఆకులు రాలక తప్పదంటే అంకురదశ ఎందుకో?
మరణం రాక తప్పదంటే శరీరధారణ మెందుకో?"

ఇత్యాది ప్రశ్నలు ఈ విస్మయాన్నే పోషిస్తాయి

ఆ) నారాయణరెడ్డిగారి కవిత్వం చాలా వరకు రూపకాతిశయోక్తిమయంగా, ఉపచారవక్రతతో నిండి ఉంటుంది షడ్జాదిసప్తస్వరాలను గుర్తించడానికి ప్రకృతిలో కనబడే విహంగాదుల ధ్వనులు చూపుతూ నెమలిచేసేకేకా ధ్వని షడ్జం అనీ, కోకిల పంచమస్వరంలో కూస్తుందనీ- ఈ విధంగా సంగీత శాస్త్రాదులలో చెప్పబడింది

ఈ విషయాన్నే నారాయణరెడ్డిగారు తమబాణీలో అమూర్తానికి మూర్తత్వారోపణ, మూర్తానికి అమూర్తత్వారోపణా చేస్తూ ఉపచారవక్రతను అవలంబించి-

"ఎక్కడో ఒక పసిమికోనలో
పిక్కటిల్లిన క్రేంకారం,
అది నాదగర్భం ప్రసవించిన షడ్జం....."
"ఎలుగెత్తిన చాతకశ్రుతి
అది నాదవర్షం ప్రసరించిన ఋషభం,"
"ఇగురులెత్తిన కుహూరావం
అది నాదతరువు పరిమళించిన పంచమం"

ఇత్యాది రూపాల్లో వర్ణిస్తారు 'నాదగర్భం', 'నాదవర్షం' 'నాదతరువు' 'నాదక్షోణి'ఇత్యాది శబ్దాలలో రూపకాలనూ, మూర్తత్వారోపాదులనూ చూడవచ్చు

ఇ) వామనుడు చెప్పిన అర్థగుణాలలో 'ఓజస్సు' ఒకటి దీనికే 'అర్థప్రౌఢి' అని పేరు అది అయిదు విధాలు వాటిలో ఒకటి - ఒక పదంతో చెప్పేదాన్ని అనేక పదాలతో చెప్పడం "చంద్రుణ్ణి ఆకాశంవలె" అని చెప్పడానికి కాళిదాసు "నయనసముత్థం జ్యోతిరత్రేరివ ద్యౌః" "అత్రినేత్రాలలో పుట్టిన తేజస్సును ఆకాశంవలె" అంటాడు. ఇది అర్థప్రౌఢి. పౌరాణికకథను మనస్సులో పెట్టుకొని-

"తలకొమ్ముతాపసుడు చేయించిన
జన్నం తొలి పండు
మౌనిమాంసాలు మెక్కే మేమేల మెకాన్ని
కడుపుచిచ్చులో వ్రేల్చిన
మరుగుజ్జు జడదారి ఆశ్రమంలో అడుగుపెట్టింది."

అని వ్రాస్తే ఈ ఓజస్సుకు (అర్థప్రౌఢికి) ఉదాహరణం అవుతుంది. (ఋశ్యశృంగుడు యాగం చేయించగా పుట్టిన వాళ్లలో మొదటివాడు రాముడు, మేకరూపందాల్చి మునుల్ని చంపే వాతాపిని జీర్ణం చేసుకొన్న అగస్త్యుని ఆశ్రమం చేరాడు అని అర్థం)

సంస్కృతంలో 'మూకపంచశతి' అనే చాలా అందమైన, మహామహిమాన్వితమైన స్తోత్రం ఒకటుంది. దీనిలో ఈ అర్థప్రౌఢి అడుగడుగునా, (కనీసం రెండు వందల శ్లోకాలలో) కనబడుతుంది ఉదా "అజ్ఞాతకచేన కేనచిదన్ధంకరణౌషధేన కమలానామ్" "పద్మాలను గ్రుడ్డిగా చేసే ఔషధాన్ని (అనగా

చం(ద్రుణ్ణి) కొప్పుమీద అలంకరించుకొన్నది "

నారాయణరెడ్డిగారి రచనలలో కూడా ఇవి అధికంగా కనబడతాయి ఇలాంటి స్థలాలలో కొంచెం ఆగి నిదానంగా అర్థం చేసుకోవలసి ఉంటుంది చదువుకుంటూ పోతే అర్థం కావు కొంచెం క్లిష్టత్వం ఉన్నా ఈ క్లిష్టత్వంలోనే ఉంది మిష్టత్వం ఒకటి రెండు ఉదాహరణలు -

1 "గాలిలోని పరుగు హరించి
కదిలే చక్రాలలో అంటించి
కాలుమీద కాలువేసుకొని
లీలగా పయనిస్తాడు."

2. "ఎక్కడో చిగురించిన ధ్వనిని
ఎన్నెన్నో తీగలుగా పారించి
శ్రవణాల పందిళ్లలోన
సౌరభాలు నింపుతున్నాడు."

"ట్యూబులలో గాలి బిగించి, ఆ ట్యూబులున్న టైర్లు చక్రాలకు అమర్చిన కార్లల్లో తిరుగుతున్నాడు". "రేడియోద్వారా పాటలు వింటున్నాడు" అని వీటి అర్థం. 'ధ్వని చిగురించడం', 'తీగలుగా సారించడం' 'శ్రవణాల పందిళ్లు' ఇవి మూర్తత్వారోపణ, రూపక ఉపచారవక్రతలకు ఉదాహరణాలు

"పరుచుకున్న చాపమీద తాను లేడు
తిరుగుతున్న బంతిమీద పరుగిడుతున్నాడు."

ఇక్కడ 'చాప' అనగా ఒకానొకప్పుడు చాపవలె నలచదరంగా ఉందనుకొన్న భూమి 'తిరుగుతున్న బంతి' అనగా గోళాకారంలో తిరుగుతూ ఉందని ఈనాడు అనుకొంటూన్న భూమి, రూపకాతిశయోక్తికి చక్కని ఉదాహరణాలు ఇంచుమించు ఈ కావ్యం అంతా ఇలాంటి అలంకారాదులతోనే నడిచింది.

ఈ) ప్రపంచపదుల్లో ఉపమాధ్వని - రూపక - తుల్యయోగితా- దీపక - ప్రతి వస్తూపమా - దృష్టాంతాలంకారాలు ఎక్కువగా కనబడతాయి ఒక్క ఉదాహరణ -

"బురదలో ఉంటున్నా తరగదు పద్మంవిలువ
తాటాకున పడిఉన్నా తగ్గదు పద్యం విలువ
అసలుసిసలు పసవుంటే అవరోధించే దెవరు

అరసికు లేమంటున్నా చెరగదు గానం విలువ
మూర్ఖులు ముంచేస్తున్నా మునగదు జ్ఞానం విలువ.''

ఇక్కడ తృతీయపాదార్థానికి మిగిలిన పాదాల అర్థం సమర్థకం అందుచేత అర్థాంతరన్యాస, తుల్యయోగితా, దృష్టాంతాలంకార కలయిక కూడా ఉన్నది శబ్దాలంకారాలు సాధారణంగా వీరి రచనలలో అంతటా ఉంటాయి

5 శ్రీ ఆరుద్రగారి రచనలలో నుంచి రెండు మూడు ఉదాహరణలు -

అ) వీరి రచనలలో ప్రతీకవిధానం - రూపకాతిశయోక్తి ప్రయోగం ఎక్కువ "త్వమేవాహం" లోని ఎలారం, పెద్దముల్లు, చిన్నముల్లు, గడియారం, మృత్యువు, మానవుడు ఇత్యాదులు - ప్రమాదసూచిక, మధ్యతరగతి వాళ్ల మనస్తత్త్వానికి కొలబద్ద, శ్రీమంతులమనస్తత్త్వానికి సూచి, మన సంఘం, సమకాలికసంక్షోభం, కవి ఇత్యాదులకు ప్రతీకలుగా నిర్ణయించారు విమర్శకులు.

ఆ) ''సమష్టి జీవన సైకతస్థలాన
వ్యష్టిజీవితం ఒక్క రేణువు కావచ్చును గాని'' – (ఆవాహన)

సమిష్టిజీవనానికి సైకతస్థలత్వారోపం. వ్యష్టి జీవితానికి రేణుత్వారోపం రూపకాలంకారం

ఇ) "అడ్డమైన కొండలని కోసుకొని ప్రవహించమని
జ్ఞాపకం చెయ్యనక్కరలేదు సరితకు
అడ్డమైన మేఘాలను చీల్చుకొని ప్రకాశించమని
జ్ఞాపకం చెయ్యక్కర్లేదు సవితకు. " (త్వమేవాహం)
ప్రతివస్తూపమాలంకారం

ఈ) "వాడికోరల నోరు తెరచిన వన్యమృగముల పోలు చీకటి
మనిషిమీదను దుముకుచున్నది." (పగటిచుక్క)

ఉ) ''గారడీవాని గమ్మత్తుల పెట్టెలో, ఉన్న పెట్టెలో ఉన్న పెట్టెలాగ
రానున్న కాలంలోనే రానున్న కాలంలోనే జరిగిపోయిన జరుగుతున్న కాలాలున్నవి''

- ఆవాహన

పై రెండు వాక్యాలలోను ఉపమాలంకారాలు రెండవ వాక్యంలో అమూర్తమైన

కాలాన్ని మమూర్తమైన పెట్టెతో పోల్చడంచేత కొంతవరకు 'అమూర్తానికి మూర్తత్వారోపం' కూడా ఉన్నది

వీరి రచన లన్నింటిలోనూ సమసమాజస్థాపనాభిలాష ప్రధానవ్యంగ్యం

6 డా పేర్వారం జగన్నాథంగారి రచనలలో నుంచి రెండు మూడు ఉదాహరణలు -

అ) 'తన్మయత్వం' అనే కావ్యంలో "నా పురావైభవప్రాభవము లోకసారి, విద్యుల్లతల వోలె విస్ఫారి మెరవగా ఇత్యాదివాక్యాలు విశాలాంధ్రావిర్భావంవల్ల ఆయన మనస్సులో కలిగిన హర్షాతిరేకాన్ని చక్కగా ధ్వనింపచేస్తున్నాయి భావధ్వని 'విద్యుల్లతవోలె' ఇత్యాదికం ఉపమాలంకారం "దినచర్య" అనే కావ్యంలోని

ఆ) "బ్రతుకుబాటలోన తుమ్మచెట్లు మొలిచినాయి
బ్రతుకు పూలతోటలోన ముండ్లపొదలు మొలిచినాయి."

అనే వాక్యంలో "బ్రతుకుపూలదోట" - రూపకాలంకారం, "తుమ్మచెట్లు," "ముండ్ల పొదలు" - రూపకాతిశయోక్తి.

ఇ) "కర్కశాలు కార్పణ్యాలు గూళ్ళు కట్టుకున్నాయి కొటారుకొమ్మలపైన."

ఈ వాక్యంలో 'కొటారుకొమ్మలు' అంటే ఉన్నతాధికారస్థానాలు. రూపకాతిశయోక్తి. కర్కశాలు, కార్పణ్యాలు గూళ్లు కట్టుకోవడంలో మూర్తత్వ-పక్షిత్వారోపణలద్వారా రూపకాతిశయోక్తి

ఈ "కనకపు సింహాసనమున. ." అనే కావ్యంలో ఏదో విధంగా ఉన్నతస్థానాన్ని సంపాదించిన వ్యక్తి ఎంత నీచంగా, ఎంత స్వార్థపరత్వంతో ప్రవర్తిస్తాడో, కుక్కను ప్రతీకగా తీసికొని విశదీకరిస్తాడు కవి

ఉ) "దీపం వెలుగుతున్నంతకాలం చీకట్లు వినయాన్ని నటిస్తాయి
దీపానికి తెలుసో తెలియదో కాని చీకట్లకి మాత్రం తెలుసు
దీపం ఆరిపోయాక అది కట్టుకొన్న కాంతిభవనంకూలుతుందని"

"తమసోమా జ్యోతిర్గమయ" అనే కావ్యంలోని ఈ అన్యాపదేశవాక్యంలో అనేకమైన అర్థాలు ధ్వనిస్తాయి ఎంత పైకి ఎదిగినా క్రిందపడతప్పదు. ఎలా క్రింద పడదొయ్యాలా అని ఎందరెందరో సమయం కోసం వేచి ఉంటారు. మానవుడైనా, దేశమైనా అట్టి పరిస్థితి రాకుండా చూచుకోవాలి. ఇలా ఎన్నో అర్థాల ధ్వని ఈ చిన్న వాక్యంలో ఇమిడి ఉంది

ఊ) "ఏకం సద్విప్రా బహుధా వదన్తి" అనే కావ్యంలో కవి, జీవుడికీ పరమాత్మకీ ఉన్న సంబంధం అవినాభావసంబంధం అనీ, జీవుడు పరమాత్మలో ఒక అంశే అనీ, అయితే పరమాత్మతో పోలిస్తే అతిక్షుద్రమైన అంశ అనీ అందమైన ఉపమానాలతో ధ్వనింపచేస్తాడు-

"నీకూ నాకూ చుట్టరికం ఎంతో తెలుసా
సంద్రానికీ సరిత్తరంగానికీ చుట్టరికం ఎంతో అంత
నీకూ నాకూ తేడా ఎంతో తెలుసా
అనంతకాలానికీ అనుక్షణానికీ తేడా ఎంతో అంత
నీకూ నాకూ పోలిక ఎంతో తెలుసా
వాఙ్మయానికీ వర్ణసమామ్నాయానికీ పోలిక ఎంతో అంత".

డా జగన్నాథంగారి జీవితాదర్శం-

ఋ) "వెన్నలాంటి దుస్తుల్ని తొడగడంకాదు
వెన్నెలల్లా బ్రతకడం మనక్కావాలి
జ్ఞానం శీలం గురించి ప్రతినిత్యం
ఏకధాటిగా వాగడం మనకొద్దు
ఇంటింట సమతాదీపాలు వెలిగించి
మనిషి గుండెలోనే గుడి కట్టించాలి." (గుడినే మింగినవానికి )

ఈ ఆదర్శం మీద ఆయనకున్న ప్రీతీ, దీనికి విరుద్ధంగా లోకంలో కనబడే స్వార్థపరులమీద అమర్షం (కోపం) ఈయన రచనలన్నింటిలోనూ కొన్నిచోట్ల వాచ్యంగాను, కొన్ని చోట్ల ధ్వనిరూపంలోను కనబడతాయి

విస్తృతిభయంవల్ల కొందరి రచనలలోనుంచి మాత్రమే ఉదాహరణలు చూపడం జరిగింది ఈ విధంగా ప్రభావవంతమైన రచనలు చేయగలిగిన ప్రతికవి రచనలోనూ అలంకారశాస్త్రీయవిషయాలు చూపవచ్చు

"నాగలి బుజాన వేసుకొని పొలం వెళ్ళే ప్రతిరైతూ నాకు
శిలువ మోస్తున్న జీసస్‌లా కనిపిస్తాడు" (కొయ్యగుర్రంలో నగ్నముని)

ఈ వాక్యంలో కవి ఉపమాప్రయోగంద్వారా ఆ రైతు అనుభవిస్తున్న కష్టాలను చూడడం వలన కలిగిన శోకాన్ని, అట్టి స్థితికి కారణమైన వాళ్ల విషయంలో క్రోధాన్నీ

ధ్వనింపచేస్తున్నాడు

స్వాతంత్ర్యానికి పూర్వం కొన్ని దేశభక్తిగీతాలు ప్రచారంలో ఉండేవి

**"మాకొద్దీ తెల్లదొరతనము,**

**దశముఖుడు మృతిచెంద, కపితీర కపిమంద**

**క్రూర రక్కసీల పొంద, వారి కిరువురికి పుట్టిరీ దొరలు"**

ఈ కల్పన ద్వారా (ఉత్ప్రేక్షా ధ్వని) కవి తెల్లవాళ్ల విషయంలో ఎంత తీవ్రమైన క్రోధాన్ని ధ్వనింపచేస్తున్నాడో ఊహించు కొనవలసినదే

ఈనాడు కూడా గద్దర్ మొదలైనవారి పాటలలో ఇలాంటి భావాలు - కరుణ, క్రోధం, ఉత్సాహం మొదలైనవి ఎలా ధ్వనిస్తున్నాయో అందరికీ తెలిసినదే

"కాడెబోయె, కుండబోయె, కూడుబోయె, గూడుబోయె" ఇత్యాదులలో శబ్దాలంకారసహకృతమైన విషాదధ్వని

**"కల్లుముంతమ్మ తల్లీ నువ్వొద్దు మాకమ్మ తల్లీ,**

**విస్కీ, సారా, బ్రాందీ, రమ్మూ, జిన్నూ ఏదీ వద్దమ్మ తల్లీ."**

ఈ మధ్య పత్రికలలో ప్రచురించిన ఈ పాటలో "కల్లుముంతా నువ్వొద్దు" అని అనకుండా "కల్లుముంతమ్మతల్లీ" అని 'తల్లీ' అనే పదం చేర్చడంతోనే భావావిష్కరణలో ఒక ప్రభావం వచ్చింది "తల్లీ' నువ్వు ఇన్నాళ్లు మాకు చేసిన ఉపకారం చాలు, ఇంక దూరంగా వెళ్లు" అని ధ్వన్యమానార్థం

రసస్ఫూర్తి శ్రవ్యకావ్యంలో కంటె ఎక్కువగా దృశ్యకావ్యాలలో ఉంటుందని వెనక చూచి ఉన్నాం దాదాపు నూరు సంవత్సరాల క్రితం (1897లో) ప్రచురించినది మొదలు నేటివరకూ బహుజనాదరాన్ని పొందుతూనే ఉన్న కన్యాశుల్కం ఉదాహరణగా తీసికొనవచ్చు ఇది ప్రారంభంనుంచి చివరవరకూ హాస్యరసప్రధానమైన రూపకం (నాటకం) ఏ దృశ్యం తీసికొన్నా హాస్యరసమే కనబడుతుంది కొంచెం కరుణస్పర్శ, శృంగార స్పర్శ ఉన్న ఘట్టాలలో కూడా హాస్యరసమే అధికారం చలాయిస్తూ ఉంటుంది ఇది ప్రధానంగా కన్యాశుల్కం అనే దురాచారాన్నీ, వృద్ధవివాహాన్నీ, తత్ఫలితంగా వచ్చే బాల్యవైధవ్యాదుల్నీ దృష్టిలో పెట్టుకొని వ్రాసిన నాటకం. ఈ నాడు ఆ దురాచారం లేదు దాని స్థానంలో వరకట్నం ప్రచారంలో ఉంది అయినా ఈ నాటకానికి ఉన్న లోకప్రియత్వం తగ్గలేదంటే దీనికి కారణం

ఇది హాస్యరసభరితం అయి ఉండడమే ఒక్కమాటు ప్రేక్షకుడు లేదా పాఠకుడు దీనిలో ప్రవేశించాడంటే తాను ఉన్న పరిస్థితి మర్చిపోయి, దీనిలో చెప్పే విషయాలు నేటి సమాజంలో లేవు కదా అన్న విషయం మర్చిపోయి, నాటకకథావస్తువుతో ఏకం అయిపోతాడు ఇదే విగళితవేద్యాంతరమైన రసానుభూతి అంటే ఇలా రసభరితాలు అవడంచేతనే ఆ యా కవిపుంగవులు వ్రాసిన, వ్రాస్తూన్న నాటకాలు, నాటికలు, ఏకాంకికలు మొదలైనవి, కథావస్తువు ఏదైనా కావచ్చు, బహుజనప్రియత్వాన్ని పొందుతున్నాయి

సినిమా కూడా రూపకమే కదా? ఏ సినిమా తీసికొన్నా వివిధరసభరితాలైన ఘట్టాలు ఎన్నో ఉంటాయి అందుచేతనే వాటిలో అంత బహుజనాకర్షణశక్తి అలాంటి రసభావాదుల చిత్రణం లేని చిత్రాలు డాక్యుమెంటరీ చిత్రాలవలెనే ఉండి పోతాయి నటనద్వారా, సంభాషణల ద్వారా రసాన్ని ఎలా పోషించాలో దానికి నిదర్శనంగా ఈ మధ్య వెలువడిన "శ్రీనాథకవిసార్వభౌముడు" అనే చిత్రాన్ని తీసికొనవచ్చు ఇందులో ప్రారంభంనుంచి శ్రీనాథుడు గౌడడిండిమభట్టు ఢక్కా పగులగొట్టించే వరకూ ఉన్న కథలో వీరరసం (పాండిత్యవీరం) పరిఢవిల్లుతుంది తరవాత కరుణరసఘట్టాలు ప్రారంభం అవుతాయి మధ్య మధ్య శృంగారరసభరితాలైన రెండు మూడు ఘట్టాలు చేర్చబడ్డాయి తిరస్కరణీవిద్యచేత అదృశ్యుడుగా ఉన్న నలుడు దమయంతి అంతఃపురంలో సంచరించే ఘట్టంలో, మరికొన్ని చోట్ల హాస్యస్పర్శ ఉంటుంది చివరికి - అంతటి మహాకవి దారిద్ర్యాదిదుఃఖాలతో బాధపడడం, నదీప్రవేశంద్వారా అతడు దేహత్యాగం చెయ్యడం ఇవన్నీ శాంతరసపోషకాలుగా ఉన్నాయి ఈ విధంగా వీరరసంతో ప్రారంభం అయిన ఈ సినిమా శాంతరసంతో ముగుస్తుంది మధ్య మధ్య శృంగారహాస్యకరుణలు అంగరసాలుగా ఉంటాయి ఏ చిత్రాన్నైనా ఈ రీతిలో సమీక్షిస్తే నూటికి నూరుపాళ్లు రససమన్వయం కుదురుతుంది పూర్తిగా రసపరిపుష్టి లేనివి ఏవైనా ఉంటే వాటిలో వివిధభావాల ధ్వనులు తప్పకుండా ఉంటాయి

ఏ సినిమాలోనైనా పాటలు పరిశీలిస్తే అవి అలంకారభూయిష్ఠాలై విభావానుభావవ్యభిచారభావాదులలో కొన్నింటిని ధ్వనింపచేస్తూ ఉంటాయి. ఉదాహరణకి- "అప్పుచేసి పప్పుకూడు" లోని - "ఎచటినుండి వీచెనో యీ చల్లని గాలీ మత్తుమందు చల్లుచూ" అనే గీతం ఉద్దీపనవిభావవర్ణనమయంగా ఉంది

సాగరసంగమంలో - 'వెన్నెలవైపు', 'పలుకు తేనెపనుకు', 'చప్పుడేలా పాపట' మొదలైన రూపకాలలో నిండి ఉన్న 'కిన్నెరసాని వచ్చిందమ్మా' అనే పాట కిన్నెరసానిని ఒక సుందరంగిగా మన మనోనేత్రాలముందు నిలుపుతుంది. చాలా సినిమాలలో అర్థవ్యయాలిచ్చే వక్రోక్తులకి కొదవలేదు. ఈ విధంగా వివిధాలంకారిక విషయాలు సినిమాలలో ఎన్నో చూడవచ్చు.

ఈనాడు 'నవల', 'కథ' అనే సాహిత్యప్రక్రియలు ఎక్కువ ప్రచారంలో ఉన్నాయి. వీటిలో కూడా కథాసంవిధానాన్ని పట్టి రసస్ఫూర్తి కలుగుతుంది. కుంతకుడి మాటలలో దీనిని 'ప్రకరణవక్రత' 'ప్రబంధవక్రత' అనవచ్చు. వీటిద్వారా పాఠకుని చిత్తాన్ని బంధించి వేయగలిగిన రచయిత రసాన్ని చక్కగా పోషించాడనే అర్థం. బాహ్యప్రపంచం మరిచిపోయి కథలో లీనం అయిపోవడమే కదా రసానుభూతి అంటే. అయితే ఇతర సాహిత్యప్రక్రియలకీ ఈ సాహిత్యప్రక్రియలకీ కొంత తేడా ఉంది. ఎంత మంచి కథ అయినా, ఎంత మంచి నవల అయినా దానిలో రెండవసారి చదివించే శక్తి చాలా అరుదుగా ఉంటుంది. సోమర్ సెట్ మాఘామ్ అనే రచయిత 'On Growing old' అనే వ్యాసంలో - "నువ్వు ఇంతకాలం సుఖమయమైన జీవితం గడిపి వృద్ధుడవు అయ్యావు కదా? అవకాశం లభిస్తే ఈ జీవితమే మళ్లీ ఇంకోమారు జీవించాలని ఉందా" అని నన్నొకరు ప్రశ్నించారు. 'అలాంటి జీవనం ఒక మాటు చదివిన డిటెక్టివ్ కథ మళ్లీ చదవడం వంటిదే అవుతుంది, రస ఉండదు' అని నేను సమాధానం చెప్పాను" అని వ్రాశాడు. నిజానికి సోమర్‌సెట్ డిటెక్టివ్ నవలల విషయంలో చెప్పినది 95 శాతం ఇతర నవలల విషయంలో కూడా నిజమే అని నా అభిప్రాయం. చక్కని వర్ణనలు, సందర్భోచితాలైన సార్వకాలికసత్యాలు చెప్పే ప్రభావవంతాలైన వచనాలు కలిపి కథను అందంగా నడిపించే ఏవో కొన్ని ('వికర్ ఆఫ్ వేక్ ఫీల్డు' దానిని ఆధారంగా తీసికొని మున్షీ వ్రాసిన 'గోదానం', 'ది టేల్ ఆఫ్ టూ సిటీస్' వంటి) నవలలు తప్ప మిగిలినవి ఒక్కమాటు చదివితే చాలు. ఇంక కథల మాట చెప్పనక్కరలేదు. పస దేవ వ్రాసిన 'ఏంటి వీలింది' వంటి కథలు దీనికి కొంతవరకు అపవాదం (Exception) కావచ్చు. 15 పేజీల ఈ కథలో అందమైన, ఆధునిక భావాలతో నిండిన ఉపమాలంకారాలు కనీసం యాభైదాకా ఉన్నాయి. కథలో మంచి వంపు (మెలిక = Twist) ఉంది. అలాంటి కథలు రెండు మూడు సార్లు చదవవచ్చునేమో. ఈ విషయం ఎలాగున్నా ఈ నవలల్లోను, కథల్లోనూ కూడా ఆలంకారిక విషయాలు

అనుప్రవేశం నిరాఘాటంగా జరుగుతుందని నిరూపించవచ్చు

"కావ్యాలంకారం"లో భామహుడు పాణినిని గూర్చి చాలా గొప్పగా ప్రశంసిస్తూ- "పాణినీయవ్యాకరణం ఇతరవిద్య లన్నింటికీ ఆశ్రయమైనది ఏ శాస్త్రాల్లో చెప్పిన విషయాలనూ ఇది ఖండించదు అన్ని విద్యల విషయంలోనూ మధ్యస్థత్వం వహించి వాటికి కావలసిన శబ్దజాలాన్ని అందిస్తూ ఉంటుంది. అందుచేత దీని ప్రామాణ్యాన్ని కాదనేవాళ్లు ఎవరుంటారు?" అని అంటాడు-

**"విద్యానాం సతతమపాశ్రయోఽపరాసాం**
**తాసూక్తాన్న చ విరుణద్ధి కాంశ్చిదర్థాన్,**
**శ్రద్ధేయం జగతి మతం హి పాణినీయం**
**మాధ్యస్థ్యాద్భవతి న కస్యచిత్ ప్రమాణమ్"** (కా. అ 5 63)

భామహుడు పాణినీయం విషయంలో చెప్పినది అలంకారశాస్త్రం విషయంలో కూడా వర్తిస్తుంది. గద్యకావ్యం అయినా పద్యకావ్యం అయినా గేయం అయినా అభినేయం అయినా, ప్రాచీనమైనా ,ఆధునికమైనా, ప్రాచ్యభాషలలో ఉన్నా పాశ్చాత్యాదిభాషలలో ఉన్నా, పొగిడే కవిత్వమైనా తెగిడే కవిత్వమైనా, ఏ మతానికి చెందినా ఏ ఇజానికి చెందినా ప్రభావవంతమైన (powerful గా ఉన్న) ప్రతీకావ్యంలోనూ ఉండే వైశిష్ట్యాన్నీ వెదకి పట్టుకొనగలదీ, దారి చూపేదీ అయిన శాస్త్రం అలంకార శాస్త్రం అందుచేత భామహుడి శ్లోకం కొంచెం మార్చి మనం ఈ విధంగా చెప్పవచ్చు-

**కావ్యానాం సతతమపాశ్రయోఽఖిలానాం**
**తేషూక్తాన్న చ విరుణద్ధి కాంశ్చిదర్థాన్,**
**శ్రద్ధేయం నను సదలంకృతీద్యశాస్త్రం**
**మాధ్యస్థ్యాద్భవతి న కస్య వా ప్రమాణమ్.**

★ ★ ★

**యత్కృపాలేశసంసర్గాన్నిబన్ధో రచితో మయా**
**తస్యైవ జానకీజానేః పదయోరయమర్ప్యతే.**
**దేవతానుగ్రహః పిత్రోస్తపశ్చాచార్యసత్కృపా,**
**కర్తాస్మ ద్గన్థజాతస్య కరణం కేవలం వయమ్.**

**శ్రీః శ్రీః శ్రీః**